# ఆంధ్రపత్రిక



THE ANDHRA PATRIKA - MADRAS. సంపుటం 42. సంచిక 157 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO మంగళవారం 6-9-1955 Reg. No. M. 1118 6 పేజీలు 1 అణా.

# ఆంధ్ర ప్రభుత్వం కట్టించిన ఇళ్లు వానాకాలంలో నిరుపయోగం

## గుడ్డలమిల్లుల ఉత్పత్తిని సాలీనా 500 కోట్ల గజాలకు పరిమితంచేయాలి

### గ్రామపరిశ్రమల్లో సహకారోద్యమానికి ప్రోత్సాహమివ్వాలని కాంగ్రెసు నివేదిక

న్యూఢిల్లీ, సెప్టెంబరు 3: దేశానికి అవసరమైనవూలు వస్త్రాలలో ఏడాదికి 500 కోట్ల గజాల ఉత్పత్తి మిల్లులకు కేటాయించి, మిగతాది చేనేత పరిశ్రమకు వదలివేయాలని అఖిలభారత కాంగ్రెసు సంఘం ఇవాళ కార్యవర్గ పరిశీలనకు సమర్పించిన నివేదికలో సూచించారు.

మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంలో ప్రభుత్వం అవలంబించిన విధానాలవల్ల సహాయం వల్ల ఉత్పత్తి పెరిగిందనీ, దీన్నిబట్టి, వస్త్ర పరిశ్రమ విషయంలో కూడా చేనేత పరిశ్రమకు నిర్ణయించే లక్ష్యం ఆ పరిశ్రమశక్తికి మించిన పని కాదని భావించవచ్చుననీ ఈ నివేదికలో విశదపరచారు.

### కండచక్కెర

కండ చక్కెర పరిశ్రమను ప్రోత్సహించడానికి కృషి జరగాలని, అయితే బెల్లం పరిశ్రమపై దెబ్బతీసే చర్యలేవీ తీసుకోరాదనీ ఒక సూచన చేశారు. భారీ పరిశ్రమలపై విధించే సెస్సువల్ల, కొన్నికొన్ని కట్టుదిట్టాలవల్ల, పరిశ్రమలోని ఇతరరంగాలలో వారికి కొంత ఇబ్బంది కలుగవచ్చు ఈ తరహా క్రింద వచ్చేవారు, లాబడి బాగా ఉంటేవారే. ఈ రూపేణ తమపై పడే అదనపు భారాలను, ఇబ్బందులను, నిరుద్యోగ సమస్య నిర్మూలనకు దేశం సాగిస్తున్న కృషిలో తమ వంతుగావారు భావించాలి, అని కోరారు.

### కుటీర పరిశ్రమలు

నిత్యావసర వస్తువుల ఉత్పత్తిలో — ముఖ్యంగా వస్త్రోత్పత్తిలో గ్రామ పరిశ్రమల రంగానికి ఒప్పగించే గురుతర బాధ్యతల దృష్ట్యా, ప్రణాళికలో ఈ రంగం అభివృద్ధికి కేటాయించే సొమ్ము రు. 200 కోట్లకే పరిమితం అయిపోదని ఈ బృందం తమ నివేదికలో ఆశాభావం వ్యక్తపరచారు. గ్రామ పరిశ్రమల రంగంలో సహకారోద్యమాన్ని ప్రోత్సహించాలన్నారు.

### దృక్పథం మారాలి

సహకారోద్యమం నిర్వహణ విషయంలో దృక్పథం మారాలని ఈ సందర్భంలో పేర్కొన్నారు. సహకార శాఖల నిర్వహణలోనూ, సహకారోద్యమ నియమ నిబంధనల విషయంలోను మార్పులు రావాలన్నారు. సహకార సంఘాలను నడపడంలో అనుసరణయోగ్యములైన విధానాలను రాష్ట్ర ప్రభుత్వాలకు తెలియచెప్పే నిమిత్తం కేంద్రప్రభుత్వం ఒక నమూనా శాసనం రూపొందించి చూపడం మంచిదని సిఫార్సు చేశారు.

ఖాదీ, ఉన్ని, తైలాల ఉత్పత్తి, దంపుడు బియ్యం పరిశ్రమ, జోళ్ల పరిశ్రమకు అవసరమైన తోళ్లను పదునుచేసే పరిశ్రమ మొదలైన విషయాలలో కూడా ఈ నివేదికలో కొన్ని సూచనలు చేశారు.

## ఒరిస్సాలో వరదలు

### బ్రాహ్మణీ నదికి గండ్లు

కటక్, సెప్టెంబరు 4: గత ఆగస్టు వరకూ వరుసగా రెండేళ్లు అనావృష్టితో సతమతమైన ఒరిస్సా రాష్ట్రం యిప్పుడు హఠాత్తుగా వరదలసమస్యను ఎదుర్కోవలసి వచ్చింది. రాష్ట్రంలోని 8 ముఖ్యనదులలో నాలుగింటికి — బ్రాహ్మణి, మహానది, ఖర్జూరి, కువాఖాయ్ నదులకు వరదలు వచ్చాయి. బ్రాహ్మణీ నది నీటిమట్టం నిన్న రాత్రి 69 అడుగులకు పెరిగింది. ఈశాన్య రైల్వే తూర్పు సెక్షనులో ఉన్న జనపురం వద్ద నీటిమట్టం 72.4 అడుగులకు పెరిగింది. గట్టుకు రెండుచోట్ల గండ్లు పడ్డాయి. రైలుమార్గానికి పశ్చిమాన పడ్డ గండివల్ల పది గ్రామాలు మునిగి పోయాయి. తూర్పునపడ్డ గండివల్ల వాటిల్లిన నష్టం యింకా తెలియరాలేదు. ఈ ఉధృతంనుండి వరద కొద్దిగా తీస్తున్నది. కాని, సాయంత్రానికి నీరు జనపురం చేరుతుందని భయపడుతున్నారు.

సంబల్‌పూర్‌లో నిన్న 16 దుక్కుల వర్షం కురిసింది. మహానది నీటిమట్టం 73 అడుగులకు పెరిగింది. దీని ఉపనది ఖర్జూరి నీటిమట్టం 22½ అడుగులకు పెరిగింది.

### కారు ప్రమాదం

రాష్ట్రమంత్రి రాధీనాథ్‌రథ్ మరి కొందరు అధికారులు వరదప్రాంతాలలో పర్యటనచేస్తూ ఉండగా, కటక్‌కు 16 మైళ్ళ దూరంలో వారు ఎక్కిన జీప్‌కారు బోల్తాకొట్టి రోడ్డుమీదనుండి దొర్లిపోయింది. కారులోనివా రంతా మోకాళ్లబంటి నీటిలో పడిపోయారు. పెద్ద ప్రమాదం జరగలేదు.

పైరోబీ, సెప్టెంబరు 4: కీన్యా రక్షణ బలాలు గడచిన 24 గంటల్లోనూ 19 మంది మౌమౌ విప్లవకారులను చంపివేశారని నేడిక్కడ ప్రకటించారు.

## మంత్రి నివాసంలో గదికప్పు పతనం

### కొత్తగా నిర్మించిన ప్రభుత్వ కార్యాలయ భవనాలకు బీటలు

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

కర్నూలు, సెప్టెంబరు 5: ప్రభుత్వోద్యోగుల నివాసానికి గత రెండు సంవత్సరాలలో ఈ పట్టణంలో నిర్మించిన ఇళ్ళు ప్రజలకూ, అధికారులకూ కూడా చాలా అసంతృప్తి కలిగించినవి. 'జగ్‌జీవన్ నగర్', "రాజభవన్ వాడ," 'ఏ', 'బి', 'సి' శిబిర ప్రాంతాలలోని దాదాపు ప్రతి ఇల్లూ ఇట్లాగే అసంతృప్తికరంగా ఉన్నది.

ముఖ్యమంత్రి ఇంటికి కూడా ఈబాధ తప్పలేదు ఆ ఇంట్లో ఒక గదిలో వానకురుస్తున్నది. ఒకటి రెండురోజుల క్రిందట అర్ధరాత్రి ఒకగది కప్పు అమాంతం కూలిపడినందువల్ల ఒక మంత్రి ఉంటున్న ఇల్లు నివాసయోగ్యం కాదని నిషేధించారు. అది వస్తువు లుంచుకునే గది కావడంవల్ల అదృష్టవశాత్తు ఎవరికీ ప్రమాదం సంభవించలేదు. ఈ ఇల్లు ప్రభుత్వం కట్టినది కాదు. మరమ్మతు చేసినది.

చెదపురుగులు దూలాలను తినివేస్తున్నందువల్ల మరొకమంత్రి ఉంటున్న ఇల్లుకూడా ఇదే పరిస్థితిలో ఉన్నది. అయితే అదికూడా ప్రభుత్వభవనం కాదు గాని, దాని మరమ్మతులకు, ఇతర భవనాల మరమ్మతులకు వెచ్చించిన ట్లే, వేలాది రూపాయలు వెచ్చించారు.

ప్రభుత్వ ప్రధాన కార్యాలయాలున్న పొట్టి శ్రీరాములు భవనాలను రూ 10 లక్షల ఖర్చుతో కట్టించారు. అవికూడా బీటలు వారినవి. రెవిన్యూశాఖ, ప్రణాళికలశాఖ, విద్యా, వైద్యశాఖల కార్యదర్శుల గదులు కురుస్తున్నవి. కొంతమంది సహాయ కార్యదర్శుల గదులుకూడా ఇట్లాగేఉన్నవి.

### భవన నిర్మాణాల ఇంజనీరుకు వాన బెడద

పబ్లిక్ వర్క్సుశాఖ ప్రధాన ఇంజనీరు కార్యాలయానికి కూడా ఈ బెడద తప్పలేదు. కుంభవర్షాలు వస్తే భవన నిర్మాణశాఖ చీఫ్ ఇంజనీరుగది ముందున్న వసారాఅంతా జలమయమవుతుంది. ఈ భవనాలమీదకూడా దాదాపు రూ 10 లక్షలు వెచ్చించారు.

### ప్రసవాలకు పనికిరాలేదు!

ప్రభుత్వ ఉద్యోగుల నివాసగృహాల కప్పులు ఏమీ బాగాలేవు. తను కాపురం ఉంటున్న కొత్తఇల్లంతా వానకురుస్తున్నందువల్ల ఒక నౌకరు ప్రసవించనున్న తన భార్యను ఇరుగుపొరుగులోఉన్న మరో ఇంటికి తీసుకు వెళ్ళవలసివచ్చింది. ఆ ఇల్లు అంతఎక్కువగా కురవడంలేదు. ఈ అవస్థంతా పడడం ఇష్టంలేక కొంతమంది ప్రభుత్వ ఉద్యోగులు ఇంకా డేరాలలోనే ఉంటున్నారు. ఉద్యోగులకోసం ప్రభుత్వం ఇంతవరకూ సుమారు వెయ్యిఇళ్లు కట్టించారు. మరో 470 ఇళ్లు నిర్మించే నిమిత్తం ఇటీవలనే సుమారు రూ. 86 లక్షలు మంజూరుచేశారు. ఈ కొత్తభవనాలు కట్టించేప్పుడైనా లోగడ జరిగిన పొరపాట్లే మళ్ళీ జరగకుండా జాగ్రత్త వహించాలని ప్రభుత్వోద్యోగులు వాంఛిస్తున్నారు.

### కోటిరూపాయలు వృధా

ఇంతవరకూ కట్టించిన భవనాలమీద దాదాపు కోటిరూపాయలు వృధాఅయినవనీ, ఈ భవనాలను ఇంత అవకతవకగా, గజిబిజిగా కట్టించడానికి బాధ్యులైన అధికారులు, కంట్రాక్టర్లను విచారించాలనీకూడా ఉద్యోగులు అభిప్రాయపడుతున్నారు.

ఇంకా 600 మంది ఉద్యోగులు డేరాలలోనూ, వెయ్యిమంది ఉద్యోగులు పట్టణంలోనూ నివసిస్తున్నారు.

## బ్యాంకులు భీమా మరి ఇతర వ్యాపారాలు నిర్వహించి ధనం సేకరించాలి

### నిరుద్యోగ సమస్య పరిష్కారానికి కాంగ్రెసు సంఘం సిఫార్సు

### సరి అయిన పద్ధతులు అవలంబిస్తే ప్రజలు ఎక్కువగా పెట్టుబడి పెట్ట గలరని సూచన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 4: "ద్వితీయ పంచవర్ష ప్రణాళిక నిరుద్యోగసమస్యను పరిష్కరించకలిగేటంతగా ఉండాలి. ఈ పథకం ద్వారా కనీసం 110 లేక 120 లక్షలఉద్యోగాలు ఏర్పడాలి. ఈ లక్ష్యాన్ని సాధించటానికి ప్రణాళికకు నిర్ణయమయిన రూ. 4300 కోట్లు చాలవని తోస్తే, ఖర్చును పెంచుకోవలసిందే. దీనికోసం కావలసిన ధనాన్ని బ్యాంకింగ్, భీమా, ఇతర పెట్టుబడి వ్యాపారాలు ప్రభుత్వమే నిర్వహించి, సంపాదించాలి," అని అఖిలభారత కాంగ్రెసు సంఘం కార్యవర్గానికి సమర్పించిన నివేదికలో హెచ్చరించింది.

నిన్న అఖిలభారత కాంగ్రెస్ సంఘపు ప్రత్యేకవర్గం ప్రణాళిక స్వరూపాన్నిగురించి చర్చించినమీదట, ఒక ఉపసంఘం ఈ నివేదికను తయారు చేసింది. ఉపసంఘానికి ప్రణాళికల మంత్రి శ్రీ నందా నాయకుడు. ఈనివేదికను అఖిలభారత కాంగ్రెస్‌వర్గాలు హర్షిస్తూ, సోషలిస్టుపద్ధతి సమాజాన్ని సాధించేందుకు పార్టీ ఇప్పటివరకూతీసుకున్న చర్యలన్నిటికన్నా ఇది నికరమయినదని ప్రశంసించినవి.

### వ్యాపారాల ద్వారా అదనపు ఆదాయం

ప్రభుత్వ ఆదాయాన్ని పెంచటానికి అవకాశాలను వివరిస్తూ ఈ నివేదిక ప్రభుత్వమే బ్యాంకింగ్, భీమా వ్యాపార పెట్టుబడులలోకి దిగాలనీ, స్వయంగా వ్యాపార రంగంలోకి కూడా దిగాలనీ సూచించింది. దేశీయ వ్యాపారంలోను, విదేశ వ్యాపారంలోనుకూడా కొన్ని సరుకుల వ్యాపారానికి ఈ ద్వితీయ ప్రణాళిక కాలంలోనే ప్రభుత్వం పూనుకోవాలని నివేదిక పేర్కొన్నది.

విపరీతమయిన ఖర్చులను, సంఘానికి పనికిరాని ఖర్చులను అరికట్టటం అభివృద్ధి కార్యక్రమాలకు పెద్దపథకం వేసుకున్నందువల్ల అవసర మవుతున్నదని నివేదిక పేర్కొన్నది. కాంగ్రెసుసంఘ ప్రత్యేక బృందాలు జరిపిన చర్చల్లో ఆర్థికమంత్రి దేశ్‌ముఖ్ మాట్లాడుతూ కొన్ని ఖర్చులపై పన్ను ఒకటి వేయాలని అంగీకరించారు.

ఎప్పుడూ కరువుతో బాధపడే ప్రాంతాల, శాశ్వతంగా బాగుచేసే కార్యక్రమాల విషయంలో ప్రత్యేక శ్రద్ధ చూపించాలని కాంగ్రెస్ సంఘ ప్రత్యేక బృందంలోని సభ్యులు భావించారు.

### ఇతర అంశాలు

ఈనివేదికలో చెప్పిన ఇతర అంశాలివి: (1) ఋణాల ద్వారానూ, కొద్ది మొత్తం పొదుపు ఉద్యమాలద్వారానూ రాగల సొమ్ము విషయంలో పథకం అంచనా మరీ తక్కువగా ఉన్నది. ప్రజలకు సరిగా నచ్చచెపితే, అనుకున్నదానిలో మరి సగభాగం ఈ రోపేణా రావచ్చును. (2) పథక నిర్వహణకు అవసరమయిన పన్నుల భారాన్ని భరించేట్టుగా ప్రజలను అనుకూలంగా తిప్పుకొని రావాలి. ఈ పన్నుల భారం ఎక్కువగా పీటిని భరించగల వాళ్లమీదనూ, ఈ పథకంవల్ల లాభించే వాళ్లమీదనూ పడేట్లు చూడాలి. (3) లోటు ఖజానా పద్ధతి పెట్టుపడికిగల అవకాశాల విషయమై ముందుగానే పరిమితులను నిర్ణయించటం కష్టం. చేయవలసింది ఏమిటంటే కొంగల ఉత్పత్తిని దృష్టిలో పెట్టుకుని అప్పు తీసుకోవాలి. ఈ ఉత్పత్తి త్వరలో జరగాలి. కాబట్టి అట్లా అప్పుచేయటమన్నది, ఉత్పత్తిని ఎక్కువ చేయటమన్న దానిమీద ఆధారపడి ఉంటుంది.

### వ్యక్తి ఆదాయాలకు గరిష్ఠ ప్రమాణం

(4) వ్యక్తుల ఆదాయాలకు గరిష్ఠ పరిమితి ఉండాలి. భూమి విషయంలో దీని నిర్ణయం శీఘ్రంగా సాగాలి. దీకాలోఉండే హెచ్చుతగ్గులు కూడా తగ్గిపోవాలి. (5) దేశ ఆర్థిక వ్యవస్థలో చిన్న పరిశ్రమలు, గ్రామీణ పరిశ్రమలు ఒక అంతర్భాగంగా శాశ్వతంగా ఉండిపోవాలి. వాటిని ఆ విధంగా అభివృద్ధి చేయాలి. పెద్ద పరిశ్రమలకూ, చిన్న పరిశ్రమలకూ ఒకేఉత్పత్తి కార్యక్రమాన్ని ఏర్పాటుచేయటం ద్వారా చిన్న పరిశ్రమలకు తగిన తోడ్పాటు ఇవ్వాలి.

### విద్యావంతుల నిరుద్యోగ సమస్యా పరిష్కారం

బొంబాయి, సెప్టెంబర్ 4: విద్యావంతుల్లో నిరుద్యోగాన్ని తొలగించేందుకు రెండవ పంచవర్ష ప్రణాళికలో దాదాపు 200 కోట్ల రూపాయలను ప్రత్యేకించాలని అఖిల భారత కాంగ్రెస్ సంఘంలో వచ్చిన ప్రతిపాదనను కేంద్ర ప్రకృతిసంపదలశాఖ మంత్రి కె. డి. మాలవియాగారు తృప్తిని వెల్లడించారు. రష్యా, రుమేనియా, పశ్చిమ జర్మనీ, బ్రిటన్‌లలో పర్యటించేందుకు వెడుతున్న భారత ఇంజనీర్ల, భూగర్భ శాస్త్రవేత్తల బృందానికి నాయకుడుగా బయలుదేరుతూ ఈయన యీ అభిప్రాయం వెల్లడించారు.

"మనదేశంలో సాంకేతిక నిపుణుల్లోనూ, విద్యావంతుల్లోనూ ప్రబలి ఉన్న నిరుద్యోగాన్ని చూస్తే, యీసమస్యను తృప్తికరంగా పరిష్కరించటానికి ఇటువంటి నిర్బంధ సాముదాయిక పద్ధతిని అనుసరించటం అవసరం" అని ఆయన అన్నారు.

నిరుద్యోగి శిబిరాలను ఏర్పాటు చేయాలన్న సూచనను కూడా ఆయన సమర్థించారు.

## పెప్సూలో ఒకశాఖ సిబ్బంది బర్తరఫ్

పాటియాలా, సెప్టెంబరు 4: పాటియాలా జిల్లాలో 5 గ్రామాలలో పశువులకు వ్యాధి నిరోధకటీకాలు వేయడంలో అశ్రద్ధ వహించి 735 పశువుల చావుకు కారణమయ్యారన్న ఆరోపణపై పెప్సూ ప్రభుత్వం రాష్ట్ర పశుపోషక శాఖలోని పరిశోధనాలయాల సిబ్బంది నంతా తాత్కాలికంగా ఉద్యోగాలనుంచి తొలగించి వేసింది. విచారణ ఇంకా జరుగుతున్నది.

తైపే, సెప్టెంబర్ 4: చైనాతీరపు సేరంగులు నేడు తమ కిందఉన్న క్వెమాయ్ ద్వీపంమీద కాల్పులు జరిపినవని కొమింటాంగ్ ప్రభుత్వం నేడు ప్రకటించింది.

## గోవా విమోచనోద్యమం:

## సత్యాగ్రహాలు వద్దని కాంగ్రెసు తీర్మానం

### ప్రభుత్వ బాధ్యతలు పెరిగినవని ప్రధానమంత్రి నెహ్రూ వివరణ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 4: గోవా విమోచనం కోసం వ్యష్టిగాగానీ, సమష్టిగా గానీ సత్యాగ్రహం చేయవలదని మొత్తంమీద దేశీయులందరినీ, ప్రత్యేకించి కాంగ్రెస్ వారిని, కోరుతూ అఖిల భారత కాంగ్రెస్ సంఘం నేడొక స్పష్టమైన తీర్మానం చేసింది.

ఈ తీర్మానాన్ని ఆమోదించిన తర్వాత శ్రీ నెహ్రూ ప్రసంగిస్తూ, ఈ తీర్మానంతో భారత ప్రభుత్వం పైన పెద్ద బాధ్యత పెట్టబడిందన్నారు. ఈ సమస్య ఎప్పుడు పరిష్కార మవుతుందో చెప్పలేరనీ, కాని తుదిఫలితం విషయంలో తమకేమీ సందేహం లేదనీ అన్నారు.

ఈ సమస్యా పరిష్కారం సందర్భంలో ప్రభుత్వ శాంతియుత వైఖరిని బలపరచవలసిందిగాకూడా తీర్మానంలో ప్రజలకు విజ్ఞప్తిచేశారు.

"భారతప్రభుత్వం పోర్చుగీసు స్థావరాల సరిహద్దులను మూసివేయటము, పోర్చుగల్లు ప్రభుత్వంతో సహకరించ నిరాకరించటములో భారతీయులు గోవా ప్రాంతంలో ప్రవేశించటము అసంభావ్యము" అని ఆ తీర్మానంలో వుంది.

అఖిలభారత కాంగ్రెస్‌సంఘ సమావేశం నిన్న ప్రారంభమై నేటితో ముగిసింది. గోవా విషయం ఎక్కువగా చర్చించింది.

### గోవాపై తీర్మానం

దీనిపై అఖిలభారత కాంగ్రెస్ సంఘం ఏకగ్రీవంగా ఆమోదించిన తీర్మానం ఈవిధంగావుంది:

భారతదేశంలోని పోర్చుగీసు స్థావరాలవిషయం లోకాంగ్రెస్ గడచిన తొమ్మిదివిండ్లలో పదేపదే తన అభిప్రాయాలనూ వెల్లడిస్తూనే వచ్చింది. భారతదేశమే స్వతంత్రమయినాగా, భారతదేశంలోని ఒక చిన్నమూల విదేశీ వలస ఆధిపత్యంకింద వుంచటం అసందర్భం అని చాపుతూవచ్చింది మొన్న మొన్న గత జూలైలో ఈ విషయమై కార్యవర్గం ఒక తీర్మానం చేసింది. అందులో భారతదేశంలో ఎక్కడా విదేశీపాలన వుండరాదనీ, గోవా ప్రజలకు స్వాతంత్ర్యం పొందే హక్కు గలదని వక్కాణించింది. గోవా స్వాతంత్ర్యం కోసం పోరాటం శాంతియుత పద్ధతులలో జరపాలనికూడా పునశ్చరణ చేసింది. అంతే కాక గోవాలో సత్యాగ్రహం చేయటానికి బయటినుంచి సమూహాలుగా ప్రవేశించ ప్రయత్నించటం తనకు సమ్మతం కాదనికూడా ప్రకటించింది.

ఆ తీర్మానం చేసిన తర్వాత చాలా పరిణామాలు సంభవించాయి. అవి సహజంగా భారతీయులను చాలా కదిలించాయి. అఖిలభారత కాంగ్రెసు సంఘం గోవాలోనూ, తదితర పోర్చుగీసు స్థావరాలలోనూ ఉంటున్న పరిస్థితినిచాలా జాగ్రత్తగా ఆలోచించింది.

### దేశభక్తులైన గోవన్లు

గోవా విమోచనకోసం పోరాటంలో చాలామంది ఎన్నోఏండ్లు కారాగారశిక్ష విధించబడ్డారు. దేశంనుంచి పంపించి వేయబడ్డారు. తుపాకిగుండ్లకు ఎదురు నిలిచారు. వలస విధానాన్ని నిరోధించటంలో ప్రాణా లర్పించారు. గోవా ప్రజలను అణిచి వేసి, భారతదేశంలో భాగమైన ఈ ప్రాంతంలో తమ వలస పరిపాలనను నిలుపుకొనటానికి చేసే ప్రయత్నాలను పోర్చుగీసు ప్రభుత్వం అవలంబిస్తున్న హింసా విధానాన్ని, క్రౌర్యాన్ని ఈ సంఘం ఖండిస్తున్నది.

క్రిందటిమాసం 15వ తేదీన పోర్చుగీసు అధికారులు నిరాయుధ ప్రజలపై కాల్పులు జరిపారు, చాలామందిని చం

(4 వ పేజీ చూడుడు)

## గాజా ప్రాంతంలో యుద్ధవిరమణ

### బేషరతుగా ఈజిప్టు సమ్మతి

లండన్, సెప్టెంబర్ 4: గత పది రోజులనుంచీ ఎన్నో సంఘర్షణలకు స్థావరమయిన గాజాప్రాంతంలో యుద్ధవిరమణకోసం సమితి పరిశీలకుడు మేజర్ జనరల్ బర్న్సు చేసిన ప్రతిపాదనలకు ఇస్రేల్, ఈజిప్టులు రెండూ నేడు సమ్మతించినవి.

ఇస్రేల్ జవాబు నేటి ఉదయం జెరూసలేంలో మేజర్ జనరల్ బర్న్సుకు అందింది. ఈజిప్టు సమ్మతి నేటిమధ్యాహ్నం కైరోలో ప్రకటించారు. ఈజిప్టుబేషరతుగా సమ్మతిని తెలియచేసిందని, తరవాత జెరూసలేంలో సమితి ప్రతినిధి ఒకరు వెల్లడించారు. ఇస్రేల్ తనసమ్మతిని తెలుపుతూ, ఆత్మరక్షణ హక్కు తనకున్నదంటూ స్పష్టపరిచింది.

### తిరిగి సంఘర్షణ?

కైరో, సెప్టెంబర్ 5: నిన్న అర్ధరాత్రి ఇస్రేల్ సైనికులు ఒక ఈజిప్టు స్థావరంమీద దాడిచేసినవని ఈజిప్టు ప్రభుత్వప్రతినిధి ఒకరు తెలియచేశారు. యుద్ధవిరమణకు ఉభయపక్షాలూ సమ్మతించిన కొద్దిగంటలకే ఈ సంఘటన జరిగిందని ఆయన ఆరోపించారు ఈ దాడిలో ఎలుగురు ఇస్రేలీ సైనికులు మరణించారనీ, ఈజిప్టు సేనలకు నష్టంలేదనీ ఆయన అన్నారు. ఈ దాడివిషయం మేజర్‌జనరల్ బర్న్సుకు తెలియచేశామనికూడా ఆయన తెలియచేశారు

## 'కాశ్మీర్ ప్రిన్సెస్' ప్రమాదకారకుడు

### ఫార్మోజా ప్రభుత్వానికి తెలియదట

తాయ్‌పే, సెప్టెంబరు 4: కాశ్మీర్ ప్రిన్సెస్ విమాన ప్రమాదానికి కారకుడని చెప్పి, అప్పగించవలసిందిగా హాంకాంగ్ ప్రభుత్వం కోరిన విమానాల క్లీనరు చౌసెమింగ్ ఎవ్వరో తమకు తెలియదని కొమింటాంగ్ ప్రభుత్వోద్యోగి ఒకరు నేడిక్కడ తెలియచేశారు. అతడెవరో తమకు తెలియనందువల అతణ్ణి తాము పట్టి అప్పగించలేమని ఆ ఉద్యోగి అన్నాడు.

పాట్నా, సెప్టెంబరు 4: ఉత్తర బీహార్‌లో వరదలు విజృంభించి, విధ్వంసం చేస్తూఉండగా, దక్షిణ బీహారులోని పలు ప్రాంతాలలో — ఛోటా నాగపూర్ సహా ప్రజలు వర్షపు చినుకు కరువై సతమత మవుతున్నారు. ముఖ్యంగా గయ, పాట్నా, మాన్‌భూం, సింగ్‌భూం, జిల్లాలలో అనావృష్టివల్ల పంటలు దక్కే అవకాశాలు సన్నగిలి పోయాయని వార్తలు వస్తున్నాయి.

## అడ్రసు మార్పు

లోగడ 34, సర్ త్యాగరాయ రోడ్డు, టి.నగరు మద్రాసు-17 లో వుంటున్న మద్రాసు సోషల్ అండ్ కల్చరల్ క్లబ్ 1—9—1955 న 6, విజయరాఘవాచారి రోడ్డు టి. నగర్ - మద్రాసు-17 కు మార్చబడింది.

## అమ్మకము

ప్రసిద్ధమైన విశాఖపట్నం మెయిన్ రోడ్డులో నున్న V. C. C. ఆఫీసు దాని బిల్డింగు 4 పెద్ద గదులు, 4 చిన్న మూల గదులు, మరుగు, కారు షెడ్డు, ఎలక్ట్రిసిటీ చుట్టు వరండాలు (సుమారు 5620 చ॥ అ॥ వి స్తీర్ణము) గలది అమ్మబడును. కావలసిన వారు Secretary, V. C. C., Main Road, Visakhapatnam వారితో ప్రత్యుత్తరములు జరుపవచ్చును.

## విజయవాడ మునిసిపాలిటీ

### టెండరు నోటీసు

విజయవాడ మునిసిపాలిటీ, కమీషనర్ వారిచే, 14—9—1955 తేది సాయంత్రం 4 గంటలవరకు, 1955—56 సం॥కు G. I. పైపు ఫిట్టింగ్సు మొదలగునవి సరఫరాలు సప్లయిచేయుటకు, నిర్ణయించిన ఫారములలో సీలు వేసిన టెండరులు స్వీకరించబడును. అదే రోజున సా॥4-30 గంటలకు మునిసిపల్ ఆఫీసులో కమీషనరువారిచే టెండర్లు తెరువబడును.

ప్రతి గ్రూపుకు రు. 1/- వంతున చెల్లించి, ఆఫీసు పనిచేయు వేళలలో మునిసిపల్ ఇంజనీరు, విజయవాడ, వారి ఆఫీసునుండి 13-9-1955 తేది సా॥ 4 గంటలవరకు వివరాలు గల టెండరు నోటీసు, ఫారములు, మరియు స్పెసిఫికేషనులు మొదలగునవి పొందవచ్చును. మిగిలిన వివరములను మునిసిపల్ ఇంజనీరునుండి పొందవచ్చును.

కమీషనరు.

## భారత ప్రభుత్వము

### ఆహార, వ్యవసాయ శాఖ.

No. E/171/1/55.

100 టన్నుల (Evaporated Unsweetened) పాల డబ్బాలు సప్లయి చేయుటకు చీఫ్ డైరెక్టరు ఆఫ్ పర్చేజ్ డైరెక్టరేట్ జనరల్ ఆఫ్ ఫుడ్, ఆహార వ్యవసాయ శాఖ, జామ్‌నగర్ హౌస్, మాన్‌సింగ్ రోడ్డు, న్యూఢిల్లీ, వారు టెండరులను కోరుచున్నారు. టెండరు ఫారములలో టెండరులు వారికి 20—9—1955 తేదీన మ॥ 3 గంటలకల్లా చేరవలెను. టెండరు ఫారములు ఉచితముగా ఇవ్వబడవు, నోట్లుకు రు. 10/-లు రొక్కంగాగానీ, లేదా మనీ ఆర్డరుద్వారాగానీ చెల్లించి, టెండరు ఫారములు ఈ ఆఫీసునుండి పొందవచ్చును. సొమ్ము పంపువారు ఈ నోటీసు నెంబరు ఉదహరించి డైరెక్టరు, విలాసం వ్రాయవలెను. ఈ సొమ్ము వాపసు యివ్వబడదు. చెక్కులు అంగీకరించబడవు. ఆహార, వ్యవసాయ శాఖవారి ఆమోదం పొందిన కంట్రాక్టర్ల జాబితాలో ఇదివరకు లేని దరఖాస్తుదారులు, టెండరుఫారములను కోరునప్పుడు, వారి బ్యాంకర్ల పేరులను తెలుపవలెను. AC-514(5)

## టెండరు నోటీసు

### పాలకొల్లు మునిసిపాలిటీ

1955-56 సంవత్సరమునకు స్టేషనరీ సామానులు సప్లయిచేయుటకు 21-9-55 న సాయంత్రం 4 గంటలవరకూ సీలు వేసిన టెండరులను పాలకొల్లు మునిసిపాలిటీ, కమీషనర్, వారిచే స్వీకరించబడును. రు. 2/- చెల్లించి టెండరు ఫారములను పొందవచ్చును. బయానా మొత్తము రు. 100/-. 21-9-55 న సాయంత్రం 4-30 గంటలకు టెండరులు తెరువబడును.

పి. కోటిలింగం,
1-9-55. కమీషనర్.

మెసర్సు. సుంకు వెంకటేశ పెరుమాళ్ చెట్టి అండ్ కో, జూవెలర్సు, వారు 27-4-1955 న పత్రికల ముఖంగా జారీ చేసిన నోటిఫికేషను సందర్భంలో, వి. సదానందం చెట్టి అనే నేను, మద్రాసు, హైకోర్టువారు తమ 29-4-55 తేదీ గల ఉత్తర్వు ద్వారా పార్ట్‌నర్లను తీసుకొనుటకు నాకు పర్మిషన్ గ్రాంటు చేశారని, మెసర్సు. సుంకు వెంకటేశ పెరుమాళ్ చెట్టి అండ్ కో వారు దాఖలు చేసిన O. S. A. No. 75/55 ను 30-8-55 తేదీన హైకోర్టువారు త్రోసివేసి ఖర్చు లిప్పించియున్నారని, ఇందు మూలముగా తెలియపరుస్తున్నాను.

ఇప్పుడు నెం. 221 N. S. C. బోస్ రోడ్డు, మద్రాసు-1, లో "జూవెలరీ మార్టు" పేరు, ఫర్మ్ క్రింద నేను వ్యాపారం చేస్తున్నాను. మా కొతాదారులు యథావిధిగా తమ అభిమానాన్ని చూపాలని కోరుచున్నాను.

మెసర్సు. సుంకు వెంకటేశ పెరుమాళ్ చెట్టి అండ్ కో వారి 27-4-55 తేదీ నోటిఫికేషను అనధికారమైనది. వారు నష్టపరిహారానికి బాధ్యులై ఉన్నారు.

వి. సదానందం చెట్టి.

సోవియట్ యూనియన్‌లో ప్రస్తుతం పర్యటిస్తున్న భారత ఫుట్ బాల్ జట్టు మాస్కో సెంట్రల్ డైనమో స్టేడియంలో అభ్యాసం చేసుకుంటున్న దృశ్యం.

## కలప పారిశ్రామికుల సహకార సంఘం

వరంగల్లు, సెప్టెంబరు 2: అజాంజాహీమిల్లు కార్మిక సంఘాధ్యక్షులు శ్రీ. సుదర్శనంగారి అధ్యక్షతన సమావేశమై కలప పారిశ్రామికులు కలప పారిశ్రామికుల సహకారసంఘం ఏర్పాటు చేశారు. దీనికి యం. కృష్ణయ్యగారిని అధ్యక్షులుగాను, మునుపు సోమలింగం గారిని కార్యదర్శిగాను, ఎం. సత్యనారాయణగారిని కోశాధిపతిగాను ఎన్నుకున్నారు.

## ప్రకటన

ఈ దిగువ గ్రామములలో తమ స్వంత బాధ్యతపై "ఆంధ్ర పత్రిక" (దిన పత్రిక, సచిత్ర వార పత్రిక, "భారతి" లను అమ్మకొనుటకు న్యూస్ ఏజెంట్లు కావలెను:

| గ్రామము | | జిల్లా |
|---|---|---|
| ధర్మవరం | ... | అనంతపురం |
| నగరి | ... | చిత్తూరు |

మేనేజరు,
ఆంధ్రపత్రిక.



## గుంటూరు మునిసిపాలిటీ

ఈ క్రింద చూపబడిన ఉద్యోగాలకు, అయా యోగ్యతలుగల వ్యక్తుల నుండి 22-9-55 తేదీవరకూ ఈ క్రింద సంతకం చేసిన వారిచే దరఖాస్తులు స్వీకరించబడును.

1. ఇంజనీరింగు సూపర్ వైజరు స్కేలు రు. 100-5-150-10-180. బి. ఇ; లేదా ఎల్. సి. ఇ; లేదా పీటికి సరిసమానమైన మరే యోగ్యతలైనా.

2. హెల్త్ సూపరిం టెండెంటు స్కేలు రు. 60-2½-80. 21-10-41 తేదీగల జి.ఓ. నెం. 2887 L. A. లో చెప్పబడిన యోగ్యతలు.

3. ఇంజనీరింగు ఓవర్‌సీర్-స్కేలు రు. 85-1-55. జామెట్రికల్ డ్రాయింగు; బిల్డింగు డ్రాయింగు; మరియు ఎస్టిమేటింగు, ఫ్రీ హ్యాండ్ అవుట్ లైన్ మరియు మోడల్ డ్రాయింగు సాంకేతిక పరీక్షలలో ఉత్తీర్ణులైనవారు.

Md. మహాదిహాంసన్,
కమీషనర్.

## టెండరు నోటీసు

### కర్నూలు మునిసిపాలిటీ

రు. 66,375 లు ఖర్చు కాగలవని అంచనాలు వేసిన 19 వీధుల సిమెంటు కాంక్రీటుచేయుటకు, మున్సిపల్ హైస్కూలు ఆవరణలో మొత్తం రు.13,000/- అంచనాలు వేసిన ఆస్‌బెస్టాస్ రేకు షెడ్లు 4 నిర్మించుటకు, సీలు వేసిన టెండరులను 15-9-55 న సాయంత్రం 4 గంటల వరకూ కమీషనరు వారిచే స్వీకరించబడును. ప్రతిపనికి రు. 1-0-8 వంతున చెల్లించిన, 10-9-55 నుండి 13-9-55 మధ్యాహ్నం 3 గంటలవరకూ టెండరు షెడ్యూల్సును పొందవచ్చును. వివరములకు మున్సిపల్ ఇంజనీర్ ను సంప్రతించండి.

ఆర్. లక్ష్మీపతి,
కమీషనర్, మ్యునిసిపల్ ఆఫీసు,
27-8-55. కర్నూలు.



# క్రీడారంగం

## మద్రాస్ వాలీబాల్‌లో గుంటూరు కాలేజీ గెలుపు

మద్రాసు, సెప్టెంబరు 4: ఇక్కడ జరుగుతున్న లయోలా కాలేజి టూర్నమెంటు పోటీలలో ఈసారి గుంటూరు హిందూ కాలేజి జట్టు వాలీబాల్ ఫైనల్స్‌లో మద్రాసు లా కాలేజిని ఓడించింది. (15-12, 9-15, 7-15, 15-9, 15-12) కిందటి సంవత్సరం కూడా హిందూ కాలేజీ ఛాంపియన్‌గా వచ్చింది.

నిన్న సెమి ఫైనల్స్‌లో హిందూ కాలేజీ లయోలా కాలేజినీ, లా కాలేజి కాల్లీ మెడికల్ కాలేజినీ ఓడించినది.

ఫైనల్స్ పోటీలో గుంటూరు జట్టు కట్టి పోటీమీద మొదటి ఆటను గెలిచింది. కాని ఆతరవాతి రెండు ఆటల్లోనూ సులభంగా ఓడిపోయింది. కాని మంచి పట్టుదలతో ఆడి నాలుగో ఆటను గెలుచుకున్నది. అయిదో ఆట వచ్చేటప్పటికి అందరికీ ఉద్రేకం, ఔత్సుక్యం కలిగినవి హిందూ కాలేజీ క్రమంగా 7-4, 13-9 స్కోరు చేసింది. లా కాలేజి మహాపట్టుదలతో అడి 14-12 వరకూ చేయగలిగింది. కాని ఆ చివర పాయింటును కూడా హిందూ కాలేజీ గెలవటంతో మరోసారి ఛాంపియన్ షిప్ వశమయింది.

ఈతడవ కూడా గుంటూరు జట్టే గెలవ వచ్చునని మొదటనుంచీ అనుకుంటున్నారు. అయితే లా కాలేజీ రెండు గేములను గెలవ కలిగిందంటే అబూబకర్ కారకుడని చెప్పవచ్చు. ఆంధ్ర జట్టులో బుచ్చిరామయ్య, సుబ్బారావులు విశేష నేర్పు చూపించారు. బుచ్చిరామయ్య దెబ్బ తీసి నప్పుడు పాయింటు రాకుండా పోయిన సందర్భాలు చాలా తక్కువ.

రెవరెండ్ ఫాదర్ ఫ్లెమింగ్ బహుమతులు పంచిపెట్టారు.

హిందూ కాలేజి - శ్రీనివాసాచారి, వెంకటేశ్వర్లు, సి. ఎస్. వరదరాజన్, ఎం. సుబ్బారావు, వి. నరసింహారావు, బుచ్చి రామయ్య, మల్లికార్జునరావు, వెంకటేశ్వర రావు.

లా కాలేజి - సెల్వరాజ్, కుమారస్వామి, సుందరరామన్, అబూబకర్, జార్జి, చొక్కలింగం, నటరాజన్, డేవిడ్ శామ్యూల్, పళనిస్వామి.

టెన్నిస్ సింగిల్స్ ఫైనల్స్‌లో నేషనల్ ఛాంపియన్ ఆర్. కృష్ణన్ లా కాలేజ ప్రతినిధి ఓ. రామచంద్రరావును ఓడించాడు (6-0,6-0,6-4)

టేబుల్ టెన్నిస్ సింగిల్స్‌లో ఎస్. సి. రాఘవన్ జె. పి. అశోక్‌ని ఓడించాడు. (21-19, 21-16, 21-15).

## రష్యాలో భారత ఫుట్‌బాల్ జట్టు

ఆరెవాన్, సెప్టెంబర్ 4: సోవియట్ యూనియన్‌లో పర్యటిస్తున్న భారత ఫుట్‌బాల్ జట్టు నిన్న యిక్కడ ఆర్మీనియా రిపబ్లిక్ జట్టుతో డ్రా చేసింది. (2-2) ఆట మధ్యలో గాలి దుమారం వచ్చి, భారత జట్టుకు కొంత ఇబ్బంది కలగజేసింది.

ఆర్మేనియా జట్టు 25, 4 వ నిమిషాల్లోనే రెండు గోలులు చేసింది. ఆ తరవాత భారత జట్టు నిలదొక్కుకుని మంచి పట్టుదలతో ఆడింది. 32 వ నిమిషంలో భారత లెఫ్టిఅవుట్ ఆంటోనీ ఒక గోలు చేశాడు. తరవాత కొద్ది సేపటికి రైట్ ఇన్ అహమద్ తోడ్పాటుతో ఆంటోనీ మరొక గోలుకూడ చేశాడు. చివరదాకా భారత ఫార్వర్డులు దెబ్బ తీస్తున్నారుకాని మరొక గోలు చేయలేక పోయినారు.

విజయవాడ, సెప్టెంబరు 3: శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులు 87 వ జన్మదినోత్సవం గత మంగళవారం సత్యనారాయణపురంలో జరిగింది. మధ్యాహ్నం ఆంధ్రకేసరి సేవాదళం బీదలకు అన్నదానం చేశారు.

# వాతావరణం

మదరాసు, సెప్టెంబరు 5: ఆంధ్ర రాష్ట్రంలో కొన్నిచోట్లలో జల్లులు పడ్డాయి. 7 వ తేదీ ఉదయంలోగా శ్రీకాకుళం విశాఖపట్నం తూర్పుగోదావరి పశ్చిమగోదావరి కృష్ణా జిల్లాలలోను ఉత్తర హైదరాబాదులోను అక్కడక్కడ కొద్దిగా వర్షించే సూచనలు కనబడుచున్నవి.

### శీతోష్ణస్థితి

| కేంద్రం | అత్యధికోష్ణం డిగ్రీలు | అల్పోష్ణం డిగ్రీలు |
|---|---|---|
| కళింగపట్నం | 88 | 80 |
| గన్నవరం | 89 | 77 |
| కాకినాడ | 86 | 74 |
| బందరు | 88 | 80 |
| నెల్లూరు | 94 | 88 |
| ఒంగోలు | 91 | 79 |
| రెంటచింతల | 89 | 76 |
| విశాఖపట్నం | 89 | 78 |
| అనంతపూరు | 89 | 74 |
| ఆరోగ్యవరం | 84 | 70 |
| కడప | 92 | 77 |
| కర్నూలు | 87 | 74 |
| హైదరాబాదు | 88 | 70 |
| మదరాసు | 92 | 76 |
| బెంగుళూరు | 80 | 66 |
| బళ్లారి | 87 | 74 |
| న్యూఢిల్లీ | 96 | 80 |

## భీమవరంలో వార్తాప్రసార సౌకర్యాలు

భీమవరం, సెప్టెంబరు 1: ఈ పట్టణంలో రేడియో ప్రసారకేంద్రం ఏర్పాటుచేయడానికి అవసరమైన పరికరాలన్నీ పురపాలకసంఘానికి చేరాయి. పట్టణంలో మొత్తం 11 చోట్ల శ్రవణయంత్రాలు నెలకొల్పాలని నిర్ణయించారు. ఇందుకు సంబంధించిన కార్యక్రమం ప్రారంభించబడింది.

ఈ ప్రసార కేంద్రాల ఏర్పాటుకు అవసరమైన సొమ్మును పురపాలకసంఘం రెండుసంవత్సరాల క్రితమే మంజూరు చేసింది. (స్వ. వి.)

## మదరాసు ధరలు

మదరాసు, సెప్టెంబరు 5:

బంగారు వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-8 ఎడ్వర్డు బొమ్మ

| | |
|---|---|
| సేల్సుటాక్సుతో సహా రు. | 62-0-0 |
| మేల్టాబంగారం తులం రు. | 95-6-0 |
| మూస బంగారు రు. | 94-2-0 |
| సీమవెండి తులం100 కి రెడీ రు. | 166-0-0 |
| చిల్లర ధర రు. | 1-11-0 |

### చెరుకు

(531 పౌ॥ 1-8 ఎక్సుకోష్టా గిడ్డంగులు మెషిన్ సేల్సుటాక్సుతో సహా)

రు. 102 నుండి 106-0-0

| | |
|---|---|
| చేరుకెనగనూనె ఎక్సుపెల్లర్ బిల్లో 3% (500పౌ.) రెడీచిల్లరధర రు. | 200-0-0 |
| 197 కొంకోయనూనె (87½ పౌనులు) | |
| అంబుమార్కు రు. | 26-0-9 |
| ఎం. ఎస్. బ్రాండ్ డబ్బా | 26-4-9 |
| రాజా రు. | 25-12-9 |

### ఆముదం

తిరుపతూరు (500 పౌ.) రు. 156-0-0

### వందదార

(నిటిష్ మగరు (2 క్వాలిటీలు)

| | |
|---|---|
| | 85-8-9 |
| సైజాపు (208 క్వాలిటీస్) | 86-8-0-87 |
| సామర్లకోట (2 క్వాలిటీ) | 85-12-9 |

## న్యూయార్క్ దూది

### అక్టోబర్ వాయిదాధరలు

న్యూయార్క్, సెప్టెంబరు 2: న్యూయార్క్ కాటన్ మార్కెట్ ధరలు నేడీ విధంగా ఉన్నవి:

| | |
|---|---|
| నేటి ప్రారంభ ధర | 33.72 |
| నేటి ముగింపు ధర | 33.62 |

## బొంబాయి మార్కెట్

బొంబాయి, సెప్టెంబరు 5:

| | |
|---|---|
| వెండి (100 తు.) | 164-0-0 |
| బంగారం (1 తు.) | 94-5-0 |
| సావరిన్ | 61-4-0 |
| వేరుశెనగ విత్తులు | 21-12-0 |
| అవిసె విత్తులు | 24-0-0 |
| అవిసె నూనె | 12-12-0 |
| ఆముదం విత్తులు | 16-8-0 |
| వేరుశెనగ నూనె | 11-1-0 |
| ఖైగర్ విత్తులు | 23-8-0 |

# తూర్పు గోదావరి జిల్లా కాంగ్రెసు

## కొత్తగా ఎన్నికైన సభ్యులు

### అమలాపురం తాలూకా

కాకినాడ, సెప్టెంబరు 4: శ్రీయుతులు పరస్వతుల రామమూర్తి, చేరి కామేశ్వర శర్మ, అకుల వెంకట సత్యనారాయణమూర్తి, బుద్దరాజు చిరంజీవి బాబు అనే వెంకట్రాజు, జగతా సూర్యనారాయణ, పులిమే వెంకట్రాజు, చేరుమూరి వెంకట ముత్తారావు, పలాది సత్యనారాయణమూర్తి, వేగేశన శివరామరాజు, గాదిరాజు విజయ రామరాజు, యనమందల వెంకట్రాజు, గాలిదేవర సూర్యనారాయణ, గొర్రెల వీరన్న, శ్రీ కొకర్లపూడి నరసింహారాజు, కోలా చంద్రయ్యన్న, నూకల సత్యనారాయణమూర్తి, శ్రీ బుద్దరాజు చిట్టిబాబు అనే వెంకట సూర్య జగన్నాథరాజు, నడింపల్లి సత్యనారాయణ రాజు, జంపన సుబ్బరాజు, అకుల కృష్ణమూర్తి, రుద్రరాజు పుల్లంరాజు, నడింపల్లి రామభద్రరాజు, పండు లక్ష్మణస్వామి, నడింపల్లి సూర్యనారాయణరాజు, శిరంగు సత్యనారాయణ మూర్తి, నడింపల్లి పద్మనాభరాజు.

### అమలాపురం

శ్రీపాద శరచ్చంద్రమౌళీ ప్రసాదరావు.

రెండవ నియోజక వర్గం: రవణం రామచంద్రరావు, అన్నవరపు రామనాథం.

### రాజోలు తాలూకా

సైనాల గణేశ్వరరావు, ఉండ్రు సుబ్బారావు, సాగి వెంకట వరహాలరాజు, మండెల విశ్వనాథం, కనుమూరి సత్యనారాయణరాజు, పులవర్తి వెంకన్న, రుద్రరాజు రామలింగరాజు, వెలివెల వెంకటాచలం, చెల్లబోయిన సత్యనారాయణ, జామన నరసింహారావు.

### కొత్తపేట తాలూకా

ముల్లపూడి రామచంద్రరావు, కాకిచేసుల సూర్యనారాయణ, కల్లేపల్లి వెంకట కృష్ణంరాజు, కోనాల రామిరెడ్డి, సబ్బెళ్ల వెంకటరెడ్డి, మానుమంతి వర్ధుల జగన్నాథశర్మ, ముత్యాల వెంకటరావు, మంతెన సూర్యనారాయణరాజు, ఇంద్రకంటి సత్యనారాయణ అవధాని, మంతిన రామకృష్ణంరాజు, త్సల్లా సుబ్రహ్మణ్యం, పుయ్యూరి సూర్యనారాయణ, రుద్దరాజు సూర్యనారాయణరాజు.

### పిఠాపురం తాలూకా

రావు వెంకటజగ్గారావు, రావు వెంకట్రావు, దంగేటి యల్లపరాజు, జోస్యుల చల్లారావు, జోగుల కాశీస్వామి, బువ్వల సూర్యరాజు, నందమూరి రంగారావు, అల్లుమల్లు నారాయణచక్రపాణి, యాళ్ల సూర్యనారాయణ, పేకేటి వెంకన్న, చక్రవర్తుల గోపాలాచార్యులు, దామెర వెంకటకృష్ణ సూర్యారావు.

### తుని తాలూకా

చింతకాయల తిమ్మయ్య, రాజా వత్సవాయ వెంకటకృష్ణంరాజు బహద్దూర్, యనమల అప్పారావు, మామిడి వెంకటరమణ.

### పెద్దాపురం తాలూకా

వనపర్తి సుబ్బారావు, వరుపులభక్తరావు, బంగారు అల్లులస్వామి, జోస్యుల సూర్యనారాయణమూర్తి, వనపర్తి వెంకట్రాజు, కూచిమంచి సోమసుందరం, తోట విశ్వేశ్వరరావు, తుమ్మల రామస్వామి, దెందుకూరి వెంకటసుబ్బరాజు, పంతం పెదకామరాజు, వత్సవాయ తిరుపతిరాజు, తోట రామస్వామి, దిడ్డి సూర్యారావు, యడ్ల సత్యనారాయణ, రామిరెడ్డి పాపారావు, సామన కామరాజు, వేగేశన అప్పలనరసింహారాజు, బండారు వెంకటఅప్పారావు, చిలకమర్రి తిరువెంగళాచార్యులు, గోడిన చంద్రరావు.

### రామచంద్రపురం తాలూకా

పిల్లా సూర్యారావు, పట్టమాటి రామమూర్తి, చంద్రు సూర్యనారాయణమూర్తి, చిగురుపాటి వీర్రాజు, పాలెపు రాజభూషణం, పైల్ల పట్టాభిరామయ్య, రిమ్మలపూడి వెంకటసుబ్బారావు చౌదరి కమ్మ బుచ్చయ్య, వల్లూరి పవనరామన్న, రిమ్మలపూడి వెంకట్రాజు, నేతి వెంకటసత్యనారాయణ, రేవల్ల సూర్యనారాయణ, ఉప్పలపాటి సత్యనారాయణ, యాదల రామమూర్తి, నాగజేవర వెంకట్రావు, గుణ్ణం రామలింగచౌదరి, మల్లిడి రామారెడ్డి.

అనపర్తి సుబ్బారాయుడు, మల్లంగి వీరరాఘవరెడ్డి, పడాల సత్యనారాయణరెడ్డి, ఉప్పెర్ల లక్ష్మీనారాయణ, అడపా వీర్రాజు, తిరాతి సూర్యనారాయణమూర్తి, గొడవర్తి జనార్దనస్వామి, సెక్కండి వెంకట్రాయుడు, దూపల నారాయణమూర్తి, మన్న వీర్రాజు.

### రాజమండ్రీ తాలూకా

బద్దిరెడ్డి భీరయ్య, శ్రీమతీ నేలకొండ వెంకటరత్నం, పుల్లి చినవెంకటస్వామి, పోర్ని వెంకట్రావు, మారిసేడి అబ్బులు, తాడాల గంగరాజు, వెలుగుబంటి వరహాలయ్య, బొడంపూడి వెంకటశాస్త్రి, రేమళ్ళ వెంకటరమణయ్య.

### కాకినాడ తాలూకా

రెడ్డి కామయ్య, కొనూరి తిరుపతిరావు, పాలగ్రామ వెంకయ్య, రేమెళ్ళ తిరుపతిరావు, విరుదా సూర్యనారాయణ, మంచి రాజయ్య, కొండపల్లి కృష్ణమూర్తి, కోలా వెంకటనారాయణరావు, యార్లగడ్డ తమ్మయ్య, ఆద్వోకేటు రాలిపాటి వెంకట్రాయ చౌదరి, కోట అచ్యుతరావు.

### భద్రాచలం నూగూరు గ్రూపులు

రాజా రాఘవరాజు యర్రంరాజు, పందిరి రామిరెడ్డి, వరహాగిరిసెట్టి శివప్రసాదరావు, వనమా వెంకటేశ్వరరావు, మొగతి ఎకల వీరన్న, కోరుపు తిమ్మరావు, పెండ్యాల సత్యం.

### చామర్లకోట పట్టణం

కాకరాల కామేశ్వరరావు, పెనుబోతుల సూర్యనారాయణరావు.

### రాజమండ్రీ పట్టణం:

కాశీభట్టలక్ష్మీనరసింహారావు, దరాద వీరాస్వామిరెడ్డి, బూర్లగడ్డ వెంకటస్వామి, పాలాది అప్పారావు, శ్రీవిడి లింగరాజు, మైలవరపు వెంకటశాస్త్రి, కొట్నా శీతారామయ్య, సలుమూరు పోలిరాజు, మామిడి అప్పారావు, గాలిదేవర కొండలరావు.

# గుంటూరుజిల్లా

గుంటూరు, సెప్టెంబరు 4: గుంటూరు జిల్లా కాంగ్రెసు సంఘానికి ఆయా తాలూకాలనుంచి, యీ దిగువ ప్రముఖులు ఎన్నికైనారు.

### గుంటూరు తాలూకా

పోటీలేకుండా ఎన్నికైనవారు:— బవనం వెంకట్రామయ్య, అరుకుళ్ళ చినవెంకటరెడ్డి, మాదల నారాయణరావు, కంచెర్ల అంజయ్య, అనుమోలు వెంకటేశ్వరరావు, మేకా మధుసూధనరావు, నడికట్టు బ్రహ్మారెడ్డి, శ్యామల గోపాలరెడ్డి, కొండా మస్తాన్ రెడ్డి, వణుకూరు దండారెడ్డి, మేడూరి రాఘవాచారి, రొద్దు చింపిరయ్య, యడ్లపల్లి కోటయ్య, పుయ్యూరు శివయ్య, తియ్యగూర చింతారెడ్డి, వణుకూరి పరమారెడ్డి, యేళ్ళ సుబ్బయ్య, గోగుల వెంకట్రావు, చేబ్రోలు హనుమయ్య, మద్ది జగన్ ప్రసాద్, చావలి సూర్యనారాయణ, పాటి శేషగిరావు, కొత్త వెంకటేశ్వర్లు, తూనుగుంట్ల వెంకట్రావు, పసరం నాగేశ్వరరావు.

పోటీలలో ఎన్నికైనవారు: వేదు వెంకటరెడ్డి, పావులూరి సాంబశివరావు.

### తెనాలి తాలూకా

అంకిరెడ్డి చినపాపిరెడ్డి, నాగళ్ళ భవాని శంకరరావు, పుప్పల వెంకయ్య, మేడికొండూరు దాదరమ్మ, వనిగళ్ళ రామకోటయ్య, గాదె నాగభూషణరెడ్డి, పాలడుగుల సాంబశివరావు, అకునూరు పోతురాజు, డా. పసుపులేటి కృష్ణమూర్తి, చల్లపల్లి ఆదెయ్య, వేములపల్లి నాగేశ్వరరావు, చావులూరి రామమోహనరావు, తియ్యగూర చేరిరెడ్డి, రావిపాటి అంజనేయులు, చుండి సుబ్బారావు, రెన్ని కోటయ్య, పులికోటయ్య, రావి వెంకటసుబ్బయ్య, నిమ్మగడ్డ వెంకట్రావు, ఆవుల సుబ్బారెడ్డి, అంద రామలింగయ్య.

పోటీలలో గెలుపొందినవారు:— రావెళ్లపల్లి కోటేశ్వరరావు, జంపాల సాంబశివరావు, బోడపాటి వెంకట్రామయ్య, ఫుతుంబాక శ్రీరాములు.

### రేపల్లె తాలూకా

పోటీలేకుండా గెల్చినవారు: అత్తులూరి రంగారావు, కట్ల రామకృష్ణయ్య, పూనావత సుబ్రహ్మణ్యం, లింగిసేని వెంకయ్య, అబ్దుల్ రహిమాన్, వద్యాల వెంకటకృష్ణయ్య, తన్నీరు జగన్మోహనరావు, విన్నం వెంకటకృష్ణయ్య, వరుమూరు కామేశ్వరరావు, కటికి వెంకట హనుమంతరావు, ప్రతివాడ కోటయ్య, నాదెండ్ల శివరామకృష్ణయ్య.

పోటీలలో గెలుపొందినవారు: బోయసపల్లి సోమయ్య, పాలాటి పద్మదాసు, కరంచంద్ గాంధి, నల్లూరి వెంకటనరసింహాచార్యులు, ఉన్నవ చంద్రయ్య, గాదె శ్రీరాములు, వర్రెపురి వెంకటరత్నం.

### బాపట్ల తాలూకా

పోటీలేకుండా ఎన్నికైనవారు: కర్రచలమయ్య, ముప్పలనేని శేషయ్య, మంతెన రంగరాజు, పెనుమత్స లక్ష్మీపతిరాజు, మంతెన వెంకట్రాజు, అబ్దుల్ ఖుద్దూస్, ఆలపాటి రాఘవయ్య, పమిడి గోపాలకృష్ణయ్య, మొవ్వా వెంకటకృష్ణయ్య, గడ్డి రామయ్య, కోడూరి శ్రీరాములు, చేర్ని సుబ్బారావు, జరుబుల వెంకటనారాయణ, చుండి రామమూర్తి, గండి కొండలరాయుడు, మద్దుకూరి నారాయణరావు, యార్లగడ్డ రంగనాయకులు, పలగాని వెంకయ్య, రావి మల్లిఖార్జునరావు, దామర్ల యల్లమంద, పుట్లా సుబ్బయ్య, మర్రిరెడ్డి బసివిరెడ్డి, పుప్పల సుబ్బారావు, భవనం కోటిరెడ్డి, రామినేని చినసుందరరామయ్య, పుచ్చకాయల అప్పారావు, ముప్పలనేని మాణిక్యారావు, లక్కరాజు భార్గవ మనోహరరావు, యసపల్లి సూర్యనారాయణ, రావుల దేవేంద్రనాథం, సుద్దంటి మసలయ్య, కన్నెటి వెంకట్రావు.

పోటీలో గెలిచినవారు: మాదిగని జీవరత్నం, యర్రం వెంకటరెడ్డి.

### ఒంగోలు తాలూకా

పోటీలేకుండా ఎన్నికైన వారు: మద్దన భాస్కరరావు, దండు రామకృష్ణారెడ్డి, సాగి విజయరామరాజు, పెనుబోతు వెంకటేశ్వర్లు, పురాలసెట్టి శింగయ్య, లింగారెడ్డి జాలారెడ్డి, కొరుమాను వెంకటసుబ్బారెడ్డి, రొంబా నారపరెడ్డి, యర్రం కోటిరెడ్డి, కురుచేటి సుబ్రహ్మణ్యం, శ్రీమతి వేముల నాగరత్నం, చాటిపర్తి చక్కారెడ్డి, నల్లమలపు శేషారెడ్డి, గొల్లపూడి వెంకటసుబ్బయ్య, చిట్టంనేని వీరాస్వామి, శృంగారపు సీతారామయ్య, పిడపల్లి కోటిలింగం, నావూరి వెంకటస్వామి.

### వినుకొండ తాలూకా (సత్తెనపల్లి తాలూకా)

పోటీలేకుండా ఎన్నికైన వారు: ఆర్ర వీరారెడ్డి, మల్లి సాంబిరెడ్డి, కళ్లెర రాములు, బూరుగూరి వెంకటసుబ్బారెడ్డి, అన్నపురెడ్డి వెంకటరెడ్డి, హాసాని సత్యనారాయణ, వాదంప్లె అప్పయ్య, మదమంచి కోటేశ్వరరావు, వెనుమల్లి రామదాసు, గుమ్మడి వెంకటకృష్ణారావు, అళ్ళ చినహనుమయ్య, యార్లగడ్డ జయరామయ్య, సైకం శ్రీరామరెడ్డి, ఎర్రెద్దు పిచ్చిరెడ్డి, నురగా సుబ్బారావు.

పోటీలో ఎన్నికైన వారు: గంగూరి శేషయ్య, యర్రం అంజిరెడ్డి, నవరసెట్టి రామకోటయ్య, గంజి బోయిన రామసూర్యనారాయణ.

### నర్సరావుపేట తాలూకా

పోటీలేకుండా ఎన్నికైన వారు: నూతి వెంకటేశ్వర్లు, బత్తుల వెంకయ్య, కొలిశెట్టి కోటస్వామి, కానుమూరి హనుమయ్య, దుద్దుకూరి పెద్దసైదులు రెడ్డి, మద్దా అంజనేయులు, సుంకుపల్లి ఉగ్రనరసింహారావు, కొత్త సూర్యనారాయణ, వంద్యాల కోటిరెడ్డి, పొన్నపాటి రామయోగిరెడ్డి, తిలారి వీరయ్య, తాటిపర్తి కాశిరెడ్డి, బాచిన వెంకట సుబ్బయ్య, గాలి సుబ్బారాయుడు, శనివారపు అంకిరెడ్డి, బతుర్వేదుల సుబ్బయ్య.

### పల్నాడు తాలూకా

పోటీలేకుండా ఎన్నికైన వారు: బోసపాటి వెంకట్రామయ్య, వంకెల ఆంజనేయరెడ్డి, పులుకూరి కోటయ్య, సూర్య వెంకబాల సైదులు, కంచాల రామదాసు, గుండ్లపల్లి పిచ్చిరెడ్డి, కన్నం పున్నయ్య, కొత్త వెంకటేశ్వర్లు, గమిడి కోటయ్య, జొన్న వెంకటేశ్వర్లు, గాదె తిమానురెడ్డి, దేవలిపల్లి మల్లయ్య, పంతంగి వెంకటేశ్వర్లు.

### వినుకొండ తాలూకా

పోటీలేకుండా ఎన్నికైన వారు: అర్లి చేరిరెడ్డి, బట్ల లింగయ్య, కంచెర్ల అదిశేషయ్య, చింతా వీరయ్య, పగిడాల కోటిరెడ్డి, పారా వెంకట్రాయుడు.

# అనంతపురం జిల్లా

అనంతపురము జిల్లా కాంగ్రెసు సంఘమునకు పోటీ లేకుండా ఆయా తాలూకాలనుంచి యీ దిగువ సభ్యులు ఎన్నికైనారు.

### హిందూపురము తాలూకా

శిరివరము అదినారాయణరావు కె. ఆర్. సత్యనారాయణ డి. యస్. పుగప్ప జి. యస్. సూర్యనారాయణ పూల వెంకటరమణప్ప శిరివరము రంగయ్య, యం. కేంకరనారాయణశెట్టి, యల్. వెంకటనారాయణప్ప.

### మడకశిర తాలూకా

మడకశిర అనంతరాజు, ఆర్. కె. నాగేశరావు, జి. రామశాస్త్రి, హెచ్. నరసింగరావు, వి. లక్ష్మీనారాయణయ్య సి. ఎ. అనందకృష్ణయ్య.

### పెనుకొండ తాలూకా

గూడూరు సుబ్రహ్మణ్యశెట్టి జి. వి. సత్యనారాయణ, కంబదూరు అశ్వర్థయ్య, బి. రామిరెడ్డి, గొట్టిపాటి సుబ్బారాయుడు, కె. రామచంద్రయ్య, ఇ. చిన్నప్పయ్య.

### కదిరి తాలూకా

ఆదపాల వెంకటరమణప్ప, యస్. శ్యామమూర్తి, కోట్ల నారాయణరెడ్డి, కె. కొండప్ప, సి. చిన్నప్ప, హెచ్. శేషప్ప, యస్. వెంకటరెడ్డి, డి. రాజారెడ్డి, వల్లారి వెంకటరామన్న, వి. నరసింహారెడ్డి, యస్. వెంకటనారాయణ, ఎ. సి. వెంకటరెడ్డి, సంగా నారాయణప్ప, శ్రీరంగం సుబ్బరాజు.

### ధర్మవరము తాలూకా

యస్. చిన్నకాశప్ప, గూడూరు పెద్దసుబ్బయ్య, పి. చంద్రశేఖరయ్య, జి. నారాయణరెడ్డి, డి. యల్. మూర్తి, రామశేషయ్య, జి. రామకృష్ణ.

### కళ్యాణదుర్గము తాలూకా

వి. ఓబయ్య, టి మలకన్న, వి. నాగనగౌడు, పి ఆర్ తిమ్మారెడ్డి, కె క్రిష్ణమూర్తి, ఈసావతి రామమూర్తి, కె అయన్న.

### అనంతపురం తాలూకా

టి నారాయణరెడ్డి, కె. వర్ ఫోర్డీన్ సాహెబ్, ఆర్. తిప్పయ్య, టి. బయన్న, పి. లక్ష్మన్న డి. సి. నరసింహులు, కె గోవిందరాజులు, కె. రాజగోపాల్, దోణ తిమ్మారెడ్డి.

### తాడిపత్రి తాలూకా

కె. లక్ష్మారెడ్డి, ఎ. వెంకటరెడ్డి, పి. రామసుబ్బారెడ్డి, గాలి నారాయణరెడ్డి, బి. సి. నరసింహారెడ్డి, యం హనుమంత రెడ్డి, యం సైమాన్ బి సి రంగప్ప, చిన్న చెన్నారెడ్డి.

### గుత్తి తాలూకా

వై. మహేశరావు టి. యం. మద్ది శేటయ్య, యస్. బి. బాలయ్య జి. గురప్ప, యస్. యం. నాగమునెయ్య, యల్ రామిరెడ్డి.

### ఉరవకొండ తాలూకా

బి రామిరెడ్డి యస్ పామన్న విరూపాక్షరెడ్డి, కాకిభట్ల శ్రీరామమూర్తి కె ఎర్రప్ప, యస్ రామయ్య కాంచ్చారెడ్డి, చందా పెద్దవెంకటేసులు, డి అశ్వత్థప్ప.

## తణుకు తాలూకా కాంగ్రెసు

తణుకు, సెప్టెంబరు 4: తణుకు తాలూకా కాంగ్రెసు సభ్యత్వమునకు దిగువ సభ్యులు ఏకగ్రీవముగా ఎన్నికైనారు. మద్దాల పద్మనాభం, వేమనమంద సత్యనారాయణరాజు గుమ్మం హారు. కొవ్వాని సూర్యారావు కననెస్తి సూర్యారావు అల్లూరి రాజంరాజు అల్లూరి పుల్లంరాజు బొల్లంపల్లి సత్యనారాయణ ఉనికి కర్రి సత్తిరెడ్డి కలిదిండి పృ. రాజు పాలమూరు ముకుంది బంగారాజు కర్రి సుబ్బిరెడ్డి కోనాల అచ్చిరెడ్డి పలగ భీమిరెడ్డి పలగల కొండరెడ్డి సుత్తినేడి అప్పారావు గంగం సుబ్బారాయుడు దేవర వీరన్న సిద్దాంతము జక్కం కృష్ణారావు కోనాల సర్ర సత్తి రామిరెడ్డి. పోట ముత్యేశ్వరరావు అల్లూరి విశ్వేశ్వరరాజు పులగం ఎల్లారెడ్డి కేతా అజ్జరం బాపుర్తి సాంబమూర్తి మల్లంపల్లి బంగారం అనే సుబ్బారావు కోటిపల్లి పాటిపాటి వెంకట సుబ్బారాజు గుణ్ణం కేశగిరి రావు చోడపల్లి కలిగనుబ్బరాజు నడింపల్లి అప్పలరాజు ఉంగరూరి రామరాజు అరవల్లి పెనుమంట్ల పోటీలు వున్నవి.

# ఆకాశవాణి

బుధవారం, సెప్టెంబరు 7

### విజయవాడ

ఉ॥ 6-50 స్వాగతం 6-55 ప్రసార విశేషాలు 7 తెలుగు వా. 7-15 మద్రాసు వి వలె 7-30 మద్రాసు వలె 8 అంగ్ల వా.

మ॥ 12-30 మ॥ పాఠశాలలకు 1 వి వలె 1-30 ఎ వలె 1-40 హిందీ వా. 1-50 తెలుగు వా. 2 వి వలె 2-15 ఉ॥ పాఠశాలలకు విహారప్రయాణములు అభివృద్ధి: చంద్రగోళానికి మనము పోగలమా? (ప్రసంగం) 4 ప్రా॥ పాఠశాలలకు.

సా॥ 5-30 ప్రొద్దుటూర్ జమాలప్ప వయొలిన్ 6 సంగీత శిక్షణ 6-15 ప్రాంతీయ వా. 6-25 స్థానిక ప్రకటనలు 6-30 గ్రామ కార్యక్రమం 7 తెలుగు వా. 7-15 పురాణ కాలక్షేపం 7-30 గానసుధ (రి) 7-45 పంచవర్ష ప్రణాళికలో విద్య: (అంగ్లమున ప్రసంగం) డా॥ కె. ఎల్. శ్రీమాలి-కేంద్ర విద్యాశాఖ ఉపమంత్రి (ఢిల్లీ నుండి రిలే) 8-50 విరామ సంగీతం (రి) 9 అంగ్ల వా. 9-15 భజన్ (రి) 9-30 వాద్య బృందం 10 ప్రసార సమాప్తి.

### మద్రాస్ (ఎ)

ఉ॥ 6-30 స్వాగతం 6-35 నేటి కార్యక్రమ వివరణ 7-0 వాద్యగోష్ఠి 7-15 తమిళ వార్తలు 7-30 ఎం. సభాపతి అయ్యర్ వీణ 8-0 అంగ్ల వార్తలు.

మ॥ 1 పాఠశాల(రి) 1-30 (రి) 1-40 హిందీ వా. 1-50 తమిళ విజయలక్ష్మి (రి) 2-0 తమిళ వా. 2-10 (రి) వలె 2-15 పాఠశాల (రి) 4-30 పాశ్చాత్య సంగీతం (రి).

సా॥ 5-30 లలితగీతం 6-0 అంగ్ల.వా. 6-15 ప్రాంతీయ వా. 6-25 తిరుమంతిపురం మణిభాగవతర్ 7-0 తమిళ సంగీత రూపకం 7-15 తమిళ వా. 7-30 యంత్ర పరిశ్రమలు 7-45 వాద్య సమాహ. (రి) 8-0 జి. గౌరి 8-30 నేషనల్ ప్రోగ్రాం (ఢిల్లీ) 8-50 (రి) వలె 9-0 అంగ్ల వా. 9-15 పాలఘాట్- వేలువు 9-45 (బి) వలె 10-30 ప్రసార సమాప్తి.

### మద్రాస్ (బి)

ఉ॥ 7-0 తెలుగు వా. 7-15 కృతి మణీసూల ఎస్. ఎల్. గాన సరస్వతి వీణావాద్యవినోద (శ్లోకం) 7-30 (ఎ) వలె.

మ॥ 12-0 కార్మికుల కార్యక్రమం 12-30 మాధ్యమిక పాఠశాలలకు 1-0 (రి) 1-30 అంగ్ల వా. 1-40 (రి) 1-50 తెలుగు వా. 2-0 గోటువాద్యం 2-15 ఉ॥ పాఠశాలలకు 4-0 ప్రాథమిక పాఠశాలలకు 4-30 (ఎ) వలె.

సా॥ 5-30 (ఎ) వలె 6-15 ప్రాంతీయ వార్తలు 6-25 లలిత సంగీతము. 6-30 గ్రామ కార్యక్రమం. 7 తెలుగున వా॥ 7-15 పురాణ కాలక్షేపం. 7-30 (ఎ) వలె. 7-45 సందొమ్మిదవ శతాబ్దములో ఆంధ్రదేశము: మహనీయ దృక్పథములో (ప్రసంగం.) నిడుదవోలు వెంకటరావు. 8 ధర్మశాల (రూపకం.) 9 (ఎ) వలె. 9-15 మద్రాసులో ఈ వారం విశేషాలు (అం.) 9-30 (ఎ) వలె. 9-45 గానలహరి (రి). 10-30 ప్రసార సమాప్తి.

### హైదరాబాద్

ఉ॥ 6-30 సుప్రభాత్ (రి). 6-35 కార్యక్రమ వివరణ. 7 తెలుగున వా॥ 7-15 టి. టి. సీత. 7-45 ??. 8 అంగ్లమున వా॥ 8-15 హిందీలో వా॥ 8-30 ఖయాల్.

మ॥ 12-30 గాత్ర సంగీతం (రి). 12-50 మరాఠీలో వా॥ 1 తెలుగు (రి). 1-10 గీతాంజలి (రి). 1-50 తెలుగున వా॥ 2-45 పాఠశాలలకు (అం.)

సా॥ 5-30 ఖయాల్. 6 కన్నడమున కార్యక్రమం. 6-30 క్రీడారంగం (ఉర్దూ సమీక్ష). ఎస్. ఎం. జలాల్. 6-40 స్థానిక ప్రకటనలు. 6-45 గ్రామసీమ ఉదయిన వ్యాఖ్యము: కృష్ణ విమల్. 7 తెలుగున వా॥ 7-15 గ్రామసీమ- సీతారామకల్యాణ (హరికథ). 7-45 కన్నడమున వా॥ 8 ధర్మశాల (రూపకం). ఆర్. వి. 8-30 ఫీల్డ్‌వెల్. 8-50 గీత్. 9 అంగ్లమున వా॥ 9-15 ఉర్దూలో వా॥ 9-30 టి. టి. సీత. 10-30 ప్రసార సమాప్తి.

'జబల్ పూర్, ఆగస్టు 29: జబల్ పూర్‌లోని ఆంధ్రులంతా నిన్న శ్రీ. వి. శాస్త్రిగారి అధ్యక్షతన సమావేశమై గోవా స్వాతంత్ర్య సమరంలో ప్రాణార్పణ చేసిన గూటి పీతారాము, బాదరాల జగన్మోహనరావులకు తదితర వత్యాగ్రహులకు, జోహారు లర్పించారు. మృతి కిరుల కుటుంబాలకు సాయుభూతి తెలుపుతూ తీర్మానం చేశారు.

# గంటల పంచాంగం

శ్రీ మన్మథ సం॥ అధిక భాద్ర॥ బ॥ చతుర్థి 1955 - సం॥ సెప్టెంబరు 6 మంగళవారం సం॥ చతుర్థి 8-24 అశ్వ 18-22 వర్జ్యం 14-38 ల 16-8 కు.

బ॥ పంచమి సెప్టెంబరు 7 బుధవారం బు॥ పంచమి 6-31 [illegible] రా 4-38 వర్జ్యం రా 4-36 ల కు.

ఆంధ్రపత్రిక

[illegible]
(మహాభారతము)

శ్రీమన్మథ సం॥ అధిక భాద్ర॥ బ॥ చతుర్థి
మంగళవారం

# అఖిలభారత కాంగ్రెస్ సంఘ తీర్మానం

దేశములోని పోర్చుగీసు స్థావరాల స్వాతంత్ర్య సంపాదనకు భారతీయ పౌరులు వ్యక్తిగతంగా గాని, సమష్టిగా గాని సత్యాగ్రహం చేయుడం సముచితంగా వుండదని అఖిలభారత కాంగ్రెస్ సంఘం తీర్మానించినది. గోవా, దయ్యూ, దామన్ లపై పోర్చుగీసు ఆధిపత్యాన్ని అంతమొందించే బాధ్యతను పూర్తిగా ప్రభుత్వానికి వదలి వేయుడమే సరియైన విధానమని అఖిల భారత కాంగ్రెస్ సంఘం అభిప్రాయపడింది. ఈ పోర్చుగీసు స్థావరాల విషయంలో భారత ప్రభుత్వం ఇంతవరకు అనుసరిస్తూవున్న విధానాన్ని కాంగ్రెస్ సంఘం ఆమోదించింది.

గోవా సమస్యపై అఖిల భారత కాంగ్రెస్ సంఘం చేసిన సుదీర్ఘ తీర్మానం ప్రజలకు ఆశాభంగాన్ని కల్గించకతప్పదు. భారతీయ పౌరులు సాగించిన సత్యాగ్రహ ఉద్యమాన్ని కాంగ్రెస్ సంఘం నిరసించ లేదు. పోర్చుగీసు స్థావరాల దాస్యవిముక్తికి ప్రాణాలర్పించిన సత్యాగ్రహులకు జోహారు లర్పించినది. సత్యాగ్రహులపై పోర్చుగీసు సైనికులు జరిపిన కిరాతకచర్యలను తీవ్రంగా ఖండించినది. అయినా ఈ తీర్మానం ఇంతవరకూ సత్యాగ్రహం చేసినవారికీ, ఇకముందు చేయ సంకల్పించినవారికీ కొంత నిరుత్సాహకరంగానే వుంటుంది. కేవలం ప్రభుత్వ స్థాయిలోనే గోవా, దయ్యూ, దామన్ సమస్య పరిష్కారమౌతుందనే విశ్వాసం కలగడం లేదు. బ్రిటన్, ఫ్రాన్సులవలె పోర్చుగల్ వివేకంతో, వాస్తవిక దృష్టితో ప్రవర్తిస్తుందనే నమ్మకం కలగడం లేదు. భారత ప్రభుత్వం తీసుకున్న చర్యలు ఫలోన్ముఖమైన సూచనలు కావు. ఇకముందు భారత ప్రభుత్వం ఏ విధానాన్ని అనుసరిస్తుందో ప్రధానమంత్రి స్పష్టం చేయలేదు. అందువల్లకూడా అఖిల భారత కాంగ్రెస్ సంఘ తీర్మానం అసంతృప్తికరంగా వుంటున్నది.

అఖిలభారత కాంగ్రెస్ సంఘం తీర్మానం ప్రకారం భారతప్రభుత్వం ఇకమీదట సత్యాగ్రహులను పోర్చుగీసు స్థావరాల్లో ప్రవేశింప నివ్వదని స్పష్టమౌతున్నది. పోర్చుగీసు స్థావరాల సరిహద్దులవద్ద ఇప్పటికంటే ఎక్కువైన కట్టుదిట్టాలు చేసి ఈ స్థావరాల్లోని ప్రజలు భారత దేశంలో ప్రవేశించడానికి వీలులేకుండా, భారతీయ పౌరులు ఈ స్థావరాల్లో ప్రవేశించడానికి వీలులేకుండా చేయుడంవల్ల సత్యాగ్రహాన్ని పూర్తిగా విరమించవలసివస్తుంది. సత్యాగ్రహులపై పోలీసులు, పోర్చుగీసు సైనికులు అమానుషంగా ప్రవర్తించడంవల్ల ప్రాణనష్టం అనివార్యమౌతున్నది. పోర్చుగీసు స్థావరాల విలీనీకరణను సాధించడానికి ఇంతటి త్యాగం అనవసరమని భారతప్రభుత్వం అభిప్రాయపడుచున్నది.

గోవా, దయ్యూ, దామన్ ల విముక్తి కేవలం జాతీయసమస్యే అయినప్పటికీ, ఈ సమస్యను అంతర్జాతీయ సమస్యగా పరిగణించవలసి వుంటుందని ప్రధాన మంత్రి అఖిలభారత కాంగ్రెస్ సంఘ సభ్యులకు సూచించారు. హైదరాబాదు కాశ్మీరు వ్యవహారాలను పరిష్కరించినట్లు పోర్చుగీసు స్థావరాల సమస్యను పరిష్కరించడం సాధ్యంగాదు. ఫ్రెంచి స్థావరాల విషయంలో అనుసరించిన విధానాన్నే పోర్చుగీసు స్థావరాల్లోనూ అనుసరించవలసి వుంటుంది. ఫ్రెంచిస్థావరాల్లోని ప్రజలు ఫ్రెంచి అధికారుల ఆధిపత్యాన్ని అంతమొందించడానికి పోరాటం సాగించినట్లే, పోర్చుగీసు స్థావరాల్లోని ప్రజలు కూడా పోరాటం సాగించాలని భారత ప్రభుత్వం మొదట్నుంచీ అభిప్రాయపడుచున్నది. అఖిల భారత కాంగ్రెస్ సంఘ కార్యదర్శి శ్రీమన్నారాయణకూడా ఇదేవిధంగా ఇంతవరకే ఒక ప్రకటన చేసివున్నారు. పోర్చుగీసు స్థావరాల్లోని భారతీయులే ఇక ఈ పోరాటాన్ని సాగించవలసి వుంటుంది. ఆ స్వాతంత్ర్యసమరం సఫలం కావడానికి భారతీయప్రజలు; ప్రభుత్వము అన్నివిధాలా సహాయపడెదరు. అఖిలభారతకాంగ్రెస్ తీర్మానం భావం ఇదే.

# శాలిహుండం శిథిలాలు

## బౌద్ధ తాంత్రికుల చరిత్ర విశేషాలు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 4: శ్రీకాకుళం జిల్లాలోని శాలిహుండం క్రీ. పూ. 2 వ శతాబ్దంనుంచి క్రీ. శ. 7 లేక 8 వ శతాబ్దం వరకు దక్షిణభారత దేశంలో ప్రఖ్యాత బౌద్ధమతంగా విలసిల్లిందని అక్కడ జరిగిన త్రవ్వకాలలో బయట పడిన శిథిలాలు ఋజువుచేస్తున్నాయి.

క్రీ. శ. 3 లేక 4 శతాబ్దానికి చెందిన ఒక మొక్కుబడి స్తూపం ఇక్కడ బయటపడింది. భారతదేశ చరిత్రలో బౌద్ధ యుగానికి చెందిన అనేక క్రొత్త విషయాలను యీ త్రవ్వకాలు తెలియజేస్తున్నాయి. ఉత్తర, దక్షిణ భారత దేశాలలో ఆనాడు వ్యాప్తిలో వున్న బౌద్ధమతానికి యీ ప్రాంతం ఒకకూడలి స్థానంగా వుండేదని భావిస్తున్నారు.

ఆనాడు వజ్రయాన బౌద్ధుల తెగకు కేంద్రాలుగా వర్ధిల్లిన విక్రమశిల, ఒడ్డియానలను అనుసరించే యీ ప్రాంతం కూడా చివరిదశలో వజ్రయాన బౌద్ధమత శాఖలకు ప్రముఖ కేంద్రంగా విలసిల్లిందని తెలుస్తోంది.

తాంత్రిక వాదాన్ని వ్యాప్తిలోకి తెచ్చిన వజ్రయాన బౌద్ధమత శాఖలకు సంబంధించిన అనేక ఆధారాలు ఇక్కడ బయటపడుతున్నాయి. ఇందులో "తారా మరీచుల" విగ్రహాలు అత్యంత ఆకర్షణీయమైనవి.

క్రీ. శ. 37 వ సంవత్సరంలో చలామణిలో ఉన్న టైబీరియస్ నాణెములు కూడా ఇక్కడ దొరకడంచూస్తే క్రీ. శ. మొదటి రెండుశతాబ్దాలలోను మధ్యధరా సముద్రతీర దేశాలతో ముఖ్యంగా రోముతో శాలిహుండంకు సంబంధాలుండేవని తెలుస్తోంది.

## డా॥ రాధాకృష్ణన్ 67 వ జన్మదినం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 5: ఇవ్వాళ ఉపరాష్ట్రపతి శ్రీ రాధాకృష్ణన్ 67 వ జన్మదినం. రాష్ట్రపతి, కేంద్రమంత్రులు పార్లమెంటు సభ్యులు, ఉన్నతోద్యోగులు, పలువురు స్నేహితులు వారి ఇంటికి వెళ్లి శుభాకాంక్షలు తెలిపారు.

రాజ్య సభలో శ్రీ వారి ప్రవేశించగానే సభ్యులు హర్షధ్వానాలు చేశారు.

# సత్యాగ్రహాలు కూడదు

(1 వ పేజీ తరువాయి)

పారు. ఇంకా చాలామందిని గాయపరిచారు. ఈ బాధలనూ అనుభవించినవారికి ఈ సంఘం జోహారు లర్పిస్తున్నది. చనిపోయినవారి కుటుంబాలకు సానుభూతిని తెలుపుతున్నది.

## అంతర్జాతీయ నీతికి విరుద్ధం

పోర్చుగీసు అధికారులు నిరాయుధులైన స్త్రీ పురుషులను తుపాకులతో కాల్చి చంపివేయటం అంతర్జాతీయనీతిని ఉల్లంఘించటమేననీ, అది నేరమనీ, నాగరిక ప్రభుత్వాలు అనుసరిస్తూవున్న కట్టుబాటుకు విరుద్ధమనీ ఈ సంఘం తన దృఢాభిప్రాయాన్ని ప్రకటిస్తూ యీ విషయాన్ని గమనార్హమైన అంశంగా పెట్టుకొంటున్నది.

పోర్చుగీసువారు భయంకరదమన నీతిని అవలంబించి నప్పటికీ తమ ప్రాంతాలను పరాయి పాలననుంచి విముక్తి కలిగించేందుకూ, తమకు స్వాతంత్ర్యం సంపాదించుకునేందుకూ గోవా ప్రజలు సాగిస్తున్న ప్రయత్నాలను ప్రశంసా భావంతో, సానుభూతితో గుర్తించుతూ స్వతంత్ర భారత దేశంలోని కోటి దేశీయుల సానుభూతి, సద్భావాలను వారికి ఈ సంఘం అందచేస్తున్నది.

## బాండుంగ్ రాజ్యాలపై ఆశ

గత ఏప్రిల్ లో బాండుంగ్ లో జరిగిన ఆసియా ఆఫ్రికా మహాసభలో పాల్గొన్న దేశాలన్నీ వలస విధానానికి వ్యతిరేకంగా ఏకగ్రీవంగా చేసిన నిర్ణయాన్ని జ్ఞప్తికి తెస్తూ, ఆ మహాసభలో పాల్గొన్న దేశాలన్నీ గోవా, తదితర పోర్చుగీసు స్థావరాల ప్రజల విముక్తికై జరిగే ఉద్యమాన్ని బలపరుస్తాయనీ, వారి స్వాతంత్ర్యోద్యమాన్ని అణిచివేయటాన్ని, పోర్చుగీసు ప్రభుత్వం అవలంబించిన హింసా, క్రూర కృత్యాలనూ తెగనాడుతాయనీ ఈ సంఘం గట్టి ఆశను వెల్లడిస్తున్నది.

భారత ప్రభుత్వం పోర్చుగీసు ప్రభుత్వంతో సహకరించ నిరాకరించుతూ చేసిన నిర్ణయాలనూ, ఈ సందర్భంలో తీసుకొన్న ఇతర చర్యలనూ ఈసంఘం బలపరుస్తున్నది. ప్రత్యేకించి భారత ప్రభుత్వం ఈ సమస్యను, అంతర్జాతీయ తగాదాలన్నిటి విషయంలో తానుసరించి నిర్ణయించుకొన్న సుప్రసిద్ధ సిద్ధాంతాలను అనగా శాంతి అహింసలను అనుసరించే పరిష్కరించ పూనుకొన్నందుకూ ఆసంగతిని అరమరలు లేకుండా వెల్లడి చేసినందుకూ ఈసంఘం హర్షిస్తున్నది. ఈవిధానం భారతదేశం జాతీయ, అంతర్జాతీయ వ్యవహారాలలో అనుసరించే విధానానికి అనుగుణమైనది మాత్రమే కాక గోవా ప్రజలూ వారి విమోచనకూ కూడా చాలా మంచిదని ఈ సంఘం విశ్వసిస్తున్నది.

భారతదేశంలోని పోర్చుగీసు స్థావరాలకు విమోచనకలిగించాలనే విషయంలోనూ, అక్కడి స్వాతంత్ర్యోద్యమాన్ని అణిచివేసేందుకు పోర్చుగీసులు అవలంబిస్తున్న క్రూరదమన నీతిపట్లనూ భారతదేశమంతటా తీవ్రమైనభావాలు ఏర్పడివుండటాన్ని అఖిల భారత కాంగ్రెస్ సంఘం బాగా అర్థంచేసుకొని, సానుభూతితో గమనించింది. అయినప్పటికీ, ఈ సమస్యను జాతీయ అంతర్జాతీయసందర్భ పరిస్థితులదృష్ట్యా గమనించవలెనేగాని, ఏపార్టీతత్వంతోనూ కాదనీ, ఈ విషయంలో భారత ప్రభుత్వ విధానాన్ని బలపరచవలసిందనీ ప్రజలకు విజ్ఞప్తిచేస్తున్నది. ఇందుకు భిన్నమైనవిధానాలు జాతినిశ్చయాన్ని, గోవా విమోచనా ప్రయత్నాలనూ కూడా బలహీనపరుస్తాయని అభిప్రాయపడుతున్నది.

కార్యవర్గం క్రితంసారిచేసిన తీర్మానంలో గోవాలోకి బయటినుంచి సమూహాలుగా ప్రవేశించ ప్రయత్నించరాదని హెచ్చరించివున్నది. దురదృష్టవశాత్తూ ఈ హెచ్చరిక పూర్తిగా పాటింపబడలేదు. సత్యాగ్రహం పేరుతోగానీ, ఇతరంగాగానీ, గోవాలోకి సమూహప్రవేశం వాంఛనీయం కాదని ఈ సంఘం గట్టిగా అభిప్రాయపడుతున్నది. భారతప్రభుత్వం, పోర్చుగీసుప్రభుత్వంతో సహకరించ నిరాకరిస్తూ నిర్ణయించాక, భారతదేశంలోని పోర్చుగీసుస్థావరాల సరిహద్దులను మూసివేసి ఈ పరిస్థితులలో భారతదేశీయులు గోవాలో ప్రవేశించటం అసంభావ్యం. అందుచేత ఈ స్థితిలో భారతీయులు వ్యష్టి సత్యాగ్రహం కూడా చేయరాదని ఈ సంఘం అభిప్రాయ పడుతున్నది.

గోవా, దామన్, దయ్యూలు తిరిగి స్వాతంత్ర్యం పొందగలవనీ, పోర్చుగల్లు భారత దేశంలోని ఈ ప్రాంతాలలో తమ నిరంకుశ పరిపాలనను వదులుకోక తప్పని పరిస్థితి రాగలదనీ ఈ సంఘం నమ్ముతున్నది. గోవా ప్రజల న్యాయమైన, ప్రశంసార్హమైన ఆశయాల పట్లనూ, స్వాతంత్ర్యంకోసం వారు చేసే ప్రయత్నాల పట్లనూ ఈ సంఘం తన పూర్తి సానుభూతి వెల్లడిస్తూ, వారికి అభినందనలు పంపుతున్నది.

పోర్చుగీసు ప్రభుత్వం ఇప్పుడయినా తమ పద్ధతులు సవ్య ప్రపంచ ఆశయాలకూ, ధోరణులకూ, నాగరక పద్ధతులకూ విరుద్ధమయినవనీ, ఆసియా ప్రజలూ, ప్రపంచంలోని స్వాతంత్ర్య కాముకులు యావన్మందీ ఆ పద్ధతులను నిరసిస్తున్నారనీ గ్రహించి, దమన నీతిని, హింసనూ విసర్జించి, ఈ సమస్యను శాంతియుతంగా పరిష్కరించుకోవటానికి సమ్మతిస్తుందని ఈ సంఘం ఆశిస్తున్నది.

గోవా విమోచనం సాధించేందుకు భారత ప్రభుత్వం, తమ శాంతి విధానానికి అనుగుణంగా న్యాయమైన సకల చర్యలనూ తీసుకొంటుందని ఈ సంఘం విశ్వసిస్తున్నది. ఈ జాతీయ విధానాన్ని పూర్తిగా బలపర్చవలసిందని ప్రజలకు విజ్ఞప్తి చేస్తున్నది.

## తీర్మానంపై చర్చ

ఈ తీర్మానాన్ని బెంగాల్ ముఖ్యమంత్రి శ్రీ బి. సి. రాయ్ ప్రతిపాదించగా, బొంబాయి ముఖ్య మంత్రి శ్రీ మొరార్జీదేశాయ్ బలపరిచారు. సమూహ సత్యాగ్రహం గురించిగానీ, వ్యష్టి సత్యాగ్రహం గురించిగానీ ఆలోచించటమే తప్పనీ, గోవా విషయంలో ప్రభుత్వ విధానాన్ని బలపర్చటం మన విధి అనీ శ్రీ రాయ్ అన్నారు. గోవా విమోచనకై పోరాటం ముఖ్యంగా గోవన్లే సాగించాలనీ, గోవన్లు గోవాలో ప్రవేశించి తమ హక్కులను చెలాయించుకొనేందుకు పూర్తి హక్కు వున్నదనీ, కాని భారతీయులు సమూహంగాగానీ, వ్యష్టిగాగానీ పోర్చుగీసు ప్రాంతంలోకి పోవటం సక్రమంకాదనీ శ్రీ దేశాయ్ అన్నారు. ఈ తీర్మానం ఏ విధమైన భయంతో చేసినట్టిదికాదనీ, భారత విదేశాంగ నీతికి ముఖ్యమయిన సిద్ధాంతాలపై ఆధారపడినట్టిదనీ కూడా ఆయనన్నారు.

తీర్మానానికి మూడు సవరణలు ప్రతిపాదింపబడినాయి. అందులో ఒకటి గోవా విమోచనకు ప్రభుత్వం 'న్యాయమైన చర్యలనే' కాక, 'సకలచర్యలూ' తీసుకోవాలని, దీనిని శ్రీ అల్లురాయ్ శాస్త్రి ఉపపాదించారు. కాని ఆఖరున అన్ని సవరణలూ ఉపసంహరించుకోబడినాయి.

స్వామిరామానందతీర్థ మాట్లాడుతూ ఇక ఇప్పుడు గోవా విషయంలో కాంగ్రెసు వైఖరి గురించి ద్వంద్వార్థానికి తావులేదన్నారు. పోలీసుచర్య ప్రసక్తే రాదనీ, అంతర్జాతీయ వ్యవహారాలలో దేశీయ విధానం అంటూ ఒకటి వుండాలనీ, లక్ష్యం సాధించేందుకు తగు చర్యలను ప్రభుత్వం తీసుకొంటుందని ఆశిస్తున్నాననీ కూడా ఆయన అన్నారు. శ్రీ స్టీఫెన్ పోర్చుగీసువారి ప్రవర్తన క్రయిస్తవ మతసిద్ధాంతాలన్నిటికీ వ్యతిరిక్తమన్నారు. గోవాకు విముక్తికలుగుతుందనటంలో సందేహం లేదన్నారు.

శ్రీ ఎన్. వి. గాడ్గిల్ ఆగస్టు 15న జరిగింది మన చరిత్రలో ఒక ఉజ్వలమైన అధ్యాయం అన్నారు. ఆరోజున కాల్పులకు గురి అయి చనిపోయిన వారి త్యాగం గోవా సమస్య సందర్భంలో పటిష్ఠంగా వ్యవహరించటానికి కావలసినంత ఆధ్యాత్మిక శక్తిని ఇవ్వగలదన్నారు. గోవా విమోచన సమితి ద్వారా పని చేస్తున్న ఇతర పక్షాలు కూడా కాంగ్రెసు వైఖరిని అర్థం చేసుకొని ప్రభుత్వంతో సహకరిస్తాయని ఆశిస్తున్నామన్నారు. శ్రీ కె. హనుమంతయ్య విదేశాంగ వ్యవహారాల విషయంలో కాంగ్రెస్ వారూ, ఇతర పక్షాలూ కూడా చాలా నిగ్రహం చూపాలన్నారు.

## శ్రీ నెహ్రూ ప్రసంగం

అనంతరం శ్రీ నెహ్రూ ఇట్లా ప్రసంగించారు: గోవా విషయంలో మన ముఖ్య లక్ష్యం అక్కడి వలస పాలనను అంతంచేయటం. ఇది జరిగిన తర్వాత భారతదేశంలో లీనం కావటం గురించి నిర్ణయించుకోవలసినవారు గోవన్లు. ఇప్పుడు ఈ తీర్మానం చేయటంతో భారత ప్రభుత్వంపై పెద్ద బాధ్యత పడింది. ఈ సమస్య ఎప్పుడు పరిష్కారమవుతుందో చెప్పలేను. కాని తుది ఫలితం విషయంలో సందేహం ఏమీలేదు. ప్రస్తుత స్థితిగతులలో అనుసరించవలసిన సరియైన మార్గం ఒక్కటే. అదే ఈ తీర్మానంద్వారా మనం అనుసరిస్తున్నాం. ఇది చాలా క్లిష్టమయిన సమస్య. చిక్కయినది. మనకు దేశంలో సత్యాగ్రహం చేయటంలో అనుభవం వుంది. అంతర్జాతీయ రంగంలో సత్యాగ్రహానుభవం లేదు. ఇప్పుడు ఈ తీర్మానంతో ఈ విషయంలో మనవైఖరి గురించి అస్పష్టతగానీ, ద్వంద్వార్థతగానీ లేకుండా చేశాము. ఈ విషయమై దేశంలో వున్న తీవ్ర ఉద్రేక పరిస్థితిని దృష్టిలో పెట్టుకొని ఆలోచిస్తే మనమీ తీర్మానం చేయటం ధైర్యంతో కూడుకొన్నదేననాలి, సరియైనసంగతిని ధైర్యంగా చెప్పటం ఎప్పుడూ మంచిది. ప్రజలను ఆంతర్యంలోకి తీసుకొని స్థితిగతులను స్పష్టంచేయటానికి ప్రయత్నించాలి. పోలీసుచర్యలు, సైనికచర్యలు కూడవనీ, సమూహ సత్యాగ్రహం పనికిరాదనీ కాంగ్రెసు ఇదివరకే స్పష్టంచేసివుంది. వ్యష్టి సత్యాగ్రహానికి మాత్రం ఇదివరకు వీలుఇచ్చాము. ఇప్పుడు పరిస్థితిని ఎట్టి సందేహాలకూ తావులేకుండా స్పష్టీకరించటమైనది. ఈ విషయంలో ఇతరపక్షాలు కాంగ్రెసును అన్యాయంగా విమర్శించినాకూడా ఇతర పక్షాలను మనం తెగనాడరాదు. ధైర్యంతో బాధలుపడి, త్యాగబుద్ధిని చూపిన వారిని గౌరవించి, మెచ్చుకోవాలి.

అంతర్జాతీయ వ్యవహారాలలో మనం మూల సిద్ధాంతాలను విస్మరించి, వ్యవహరించటం మంచిది కాదు. గోవా భౌగోళికంగా భారతదేశం భాగమే అయినా అది భారత సమాఖ్యలో భాగం కాదన్నది స్పష్టంగా తెలుసుకోవాలి. ఈ విషయంలో మనం ఒక పరాయి దేశంతో వ్యవహరించాలన్న సంగతిని గుర్తించాలి. అంతర్జాతీయ వ్యవహారాలలో మనకొక దేశీయవిధానం వుండవలెనన్న మాట నిజమే. అయితే దేశీయ విధానం అంటే అది అయోమయంగా, సుక్రమంగా ఉండాలని అర్థంకాదు. రాజకీయ పక్షాల వైఖరులలో ప్రధానమయిన విభేదాలున్నప్పుడు రాజీ సాధ్యంకాదు. మనవిధానం సమగ్రమయినదీ సంస్థితమయినదీ అయివుండాలి. ఇతరపక్షాలను ఒప్పించి సాధ్యమయినంతవరకూ మనదృక్పథానికి సన్నిహితులను చేయటానికి ప్రయత్నించాలనేదానికి కాదనను. ఆ పని చేయవలసిందే.

గోవా విషయంలో కాంగ్రెసు ఒక ప్రత్యేక వైఖరి ఎందుకు వహించిందో ప్రజలకు వివరించే బాధ్యత కాంగ్రెసు వారిపై ఉంది. కాంగ్రెసువారు ప్రజలలో సాన్నిహిత్యం కలిగి, వారిని అంతర్యంలోకి తీసుకొని ఇవన్నీ చెప్పాలి.

## సరిహద్దు మూసివేతపై వ్యాఖ్యానం

అఖిల భారత కాంగ్రెసు చేసిన తీర్మానంలో 'సరిహద్దు మూసివేత' అనే మాటకు అర్థం ఇకమీదట భారతీయులను గోవాలోకి, గోవన్లను భారత దేశంలోకి రానివ్వరని కాంగ్రెసు వారు అన్వయం చెప్పుతున్నారు. అయితే భారతదేశంలోని గోవనులు మాత్రం గోవాలోకి వెళ్ళనిస్తారని కూడా దానికి అర్థమట.

ఇంతేకాక భారతప్రభుత్వం గోవాలోని తమ ప్రతినిధిని ఉపసంహరించి వేసిన తర్వాత తీసుకొన్న చర్య కూడా ఈ మాటలో ధ్వనిస్తోందని కాంగ్రెసు వారన్నారు.

అఖిలభారత కాంగ్రెసు సంఘం చేసిన ఈ తీర్మానం పోర్చుగీసు స్థావరాలలో స్వాతంత్ర్యోద్యమాన్ని అవరోధిస్తుందనీ, ప్రజలు నిరుత్సాహం పడటం నిశ్చయమనీ [illegible] సోషలిస్టు నాయకుడు శ్రీ [illegible] అన్నారు.

# పత్రికలపై అజమాయిషీ

## రిజిస్ట్రార్ కు విశేష అధికారం తగదు

### సంపాదకుల సభ తీర్మానం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 4: పత్రికల రిజిస్ట్రేషన్ సవరణ బిల్లులో, రిజిస్ట్రార్ నియామకానికి సంబంధించిన అంశాలు, తీవ్ర పర్యవసానాలకు దారితీసేవిగా ఉన్నవని అఖిల భారత పత్రికా సంపాదక మహాసభ స్థాయీ సంఘ సభ్యులు ఆందోళన వెలిబుచ్చారు.

శ్రీ ఎ. డి. మణి అధ్యక్షతన వీరు నిన్న ఇక్కడ సమావేశమై ఈ బిల్లుపై విపులంగా చర్చ జరిపి దీనికి కొన్ని సవరణలు సూచించారు.

పుటల సంఖ్యనుబట్టి ధరలు నిర్ణయించే విషయానికి సంబంధించిన వివరాలన్నీ పత్రికా వ్యాపారం నిర్వహించేవారు ఆలోచించి, ఆపైన ప్రభుత్వానికి నివేదించడం మంచిదని సభ్యులంతా భావిస్తున్నట్లు, ఈ చర్చల అనంతరం విడుదల చేసిన పత్రికా ప్రకటనలో తెలియచేశారు.

రిజిస్ట్రార్ నియామకం పై జరిగిన చర్చలో, ఈవిషయమై బిల్లులోని చేర్చిన అంశాలు, తీవ్ర ఫలితాలకు దారితీసేవిగా ఉన్నవనీ, రిజిస్ట్రార్ నిర్వహించదగు వ్యవహారాలకు మించి ఉన్నవనీ పలువురు సభ్యులు అభిప్రాయ పడ్డారు. దేశంలో పత్రికల స్థితిగతులకు సంబంధించిన తాజా సమాచారం సమగ్రంగా రూఢిగా తెలియరానందువల్ల, ఒక రిజిస్ట్రార్ ను నియమించాలని ప్రెస్ కమిషన్ నివేదికలో సిఫార్సు చేశారనీ, ఈ దృష్ట్యా రిజిస్ట్రార్ అధికారాలు కూడా ఆమేరకే ఉండాలి కాని, మించరాదనీ ఈ సందర్భంలో సూచించారు. పత్రికలను రిజిస్ట్రార్ కోరతగు సమాచారం విషయమై ఈ బిల్లులో ని అంశం చాలా విస్తృతంగా ఉన్నదనీ, ఇష్టం వచ్చినపుడు, తనకు అవసరమని తోచిన సమాచారం అంతా చెప్పాలని కోరే అధికారం ఇస్తున్నదనీ, ఇది ఇలా కాకుండా, అఖిల భారత సంపాదక సభ అభిప్రాయాలకు అనుగుణమైన పద్ధతిలో రూపొందించి, తగు పరిమితులు ఏర్పాటు చేయాలనీ ఈ స్థాయి సంఘం సూచించారు.

## రిజిస్ట్రార్ అధికారాలు

తనకు అవసరమనితోచే సమాచారం స్వీకరించడానికై పత్రికా కార్యాలయంలో ప్రవేశించడానికి రిజిస్ట్రార్ కు అధికారం ఇవ్వాలన్న అంశం పట్ల ఆందోళన వెలిబుచ్చారు. ఒక పత్రిక, రిజిస్ట్రార్ అడిగిన సమాచారం అందచేయని సందర్భంలో మాత్రమే అతనికి కార్యాలయంలో ప్రవేశించే అధికారం ఉండాలనీ, అదయినా, ముందుగా, మేజిస్ట్రేటువద్ద ఉత్తర్వులు తీసుకుని మరీ వెళ్లాలనీ సభ్యులు అభిప్రాయపడ్డారు. రిజిస్ట్రార్ ప్రభుత్వానికి అందచేసే వార్షిక నివేదికలో ప్రజా శ్రేయస్సుకు సంబంధించిన విషయాలనే వ్రాయాలనీ, బయటివారికి, పత్రికల సమాచారం కొంత రుసుముపై ఇచ్చినపుడు, ఈబిల్లులో పేర్కొన్న మేరకే సమాచారం విడుదల చేయాలనీ సూచించారు.

ఆగస్టు 8, 9 తేదీలలో కేంద్ర సమాచార శాఖ ఏర్పాటుచేసిన సమావేశంలో పుటలను బట్టి ధరలు నిర్ణయించే పద్ధతిని మాత్రప్రాయంగా బలపరచే విషయమై పత్రికా సంపాదక సభవహించిన వైఖరిని, అధ్యక్షుడు ఈ సమావేశంలో తెలియ చెప్పారు.

# కరవు ప్రాంతాలలో మధ్యరకం నీటివనరుల నిర్మాణం

## రు 8 కోట్లతో 150 వేల ఎకరాలకు సాగు సౌకర్యం కల్గించాలని ప్రభుత్వాలోచన

కర్నూలు, సెప్టెంబరు 5: నిరంతరం కరవు కాటకాలకు ఆలవాలంగా ఉండే శ్రీకాకుళం, విశాఖ రాయలసీమ జిల్లాలలో, రు 8 కోట్లు ఖర్చు పెట్టి కొన్ని మధ్యరకం ప్రాజెక్టులు నిర్మించాలని, ప్రభుత్వం ఆలోచిస్తున్నది. ఈ ప్రాజెక్టుల నిర్మాణం ఫలితంగా సుమారు 1½ లక్షల ఎకరాలకు సౌకర్యం కలుగుతుంది.

### శ్రీకాకుళం జిల్లా

ఈజిల్లాలో యీదిగువ ప్రాజెక్టులు ప్రభుత్వ ఆలోచనలో ఉన్నవి. మామిడిపల్లి ఆనకట్టపథకం దీనికి అయ్యేఖర్చు రు 1678 వేలు. సాగులోకివచ్చే భూమి 5237 ఎకరాలు. సాలూరు తాలూకా దండిగాం అనే గ్రామంవద్ద మామిడిపల్లి గెడ్డకు ఆనకట్ట నిర్మించి కుడి ప్రక్కన ఒకకాల్వ, ఎడమవైపున ఒక కాల్వ త్రవ్వుతారు.

కుడికాల్వ పొడవు 8 మైళ్లు ప్రవాహ ప్రమాణం 56 క్యూసెక్కులు. ఎడమ కాల్వ పొడవు 9 మైళ్లు - ప్రవాహ ప్రమాణం 59½ క్యూసెక్కులు-క్రొత్తగా 5237 ఎకరాలు సాగులోకి రావడమే గాక యిప్పుడున్న 1844 ఎకరాలకు నమ్మకంగా నీరు సరఫరా అవుతుంది.

సడిగం ప్రాజెక్టు: దీనికి అయ్యేఖర్చు 1270 వేలు. సోంపేట తాలూకా బుట్టాపురమునకు 8 మైళ్ళ ఎగువన మహేంద్రతనయ ఎడమగట్టున, రాతికట్టడంలో ఒకతూము నిర్మించి, అక్కడినుంచి 9 మైళ్లు 6 ఫర్లాంగుల పొడవున కాలువ త్రవ్వుతారు ఇప్పుడు చెరువులక్రింద సాగవుతున్న 3 వేల ఎకరాలకు కావలసినంత నీరు సరఫరా చేయడమేగాక, క్రొత్తగా మరో రెండువందల ఎకరాలను సాగులోకి తేవీలవుతుంది. కోటిపల్లి గెడ్డ రిజర్వాయరు: ఇది పాతపట్నం తాలూకాలోనిది. నిర్మాణానికి అయ్యే ఖర్చు రు 1268 వేలు. ఈ రిజర్వాయరు పరిమాణం 540 మిలియన్ ఘనపుటడుగులు. ప్రస్తుతం ఉన్న ఆయకట్టును సుస్థిరకచేయడానికి, మరో 849 ఎకరాలను సాగులోకి తేవడానికి యిది ఉద్దేశించబడింది.

వట్టి గెడ్డ రిజర్వాయరు: నిర్మాణానికయ్యే ఖర్చు రు. 2032 వేలు. 8840 ఎకరాలకు లాభిస్తుంది. ఈ పథకం ప్రకారం, పార్వతీపురం తాలూకా పరమదుంగం గ్రామంవద్ద నాగావళి ఉపనదియైన వట్టిగెడ్డమీద 6881½ మిలియన్ ఘనపుటడుగుల పరిమాణంగల రిజర్వాయరు నిర్మింపబడుతుంది. అక్కడ పెద్ద తూము ఒకటి నిర్మించి ఒక కాల్వ త్రవ్వుతారు.

జంఝావతి రిజర్వాయరు: నిర్మాణానికి అయ్యే ఖర్చు రు 584 వేలు. పార్వతీపురం తాలూకా బంజుగుప్ప గ్రామ సమీపంలో, జంఝావతికి రిజర్వాయరు నిర్మించి ప్రధానమైన తూము నుండి ఒక పెద్దకాల్వ, దానికి 9 చిన్నకాల్వలు త్రవ్వుతారు. ఈ రిజర్వాయరు క్రింద క్రొత్తగా 7530 ఎకరాలు సాగులోకి వస్తుంది. ఇప్పుడు సాగులో ఉన్న 18670 ఎకరాలకు లాభం కలుగుతుంది. ప్రత్యేక సిబ్బందితో, యీ పథకం దర్యాప్తు చేయించవలసి ఉన్నది.

బాహుద ఆనకట్ట: బాహుద నదికి ఇచ్ఛాపురం వద్ద ఆనకట్ట నిర్మించి, నదినుండి 8 కాల్వలు త్రవ్వాలని, ఆ కాల్వలక్రింద, 28 గ్రామాలలో 36 వేల ఎకరాలకు అవిచ్ఛిన్నంగా నీరు సప్లయి చేయించాలని ఆలోచనలో ఉన్నది.

### విశాఖజిల్లా

గడిసమ్మ రిజర్వాయరు: నిర్మాణానికయ్యే ఖర్చు 48 లక్షలు. గూడెం తాలూకా కృష్ణదేవ్ పేటకు ఎగువన తాండవ ఉపనదియైన బోడ్డేరుకు రిజర్వాయరు నిర్మిస్తారు. దీని పరిమాణం 180 మిలియన్ ఘనపుటడుగులు. 3880 ఎకరాలు క్రొత్తగా సాగులోకి వస్తుంది. ఇప్పడున్న 670 ఎకరాల ఆయకట్టుకు స్థిరంగా నీరులభిస్తుంది. తాండవనదికి బాగా ఎగువనకట్టే రిజర్వాయరు యిదే. ఇదిగాక దిగువన గంటవారి కొత్తగూడెంవద్ద ఒక రిజర్వాయరు, లేక బానిపాలెంవద్ద మరొక రిజర్వాయరు నిర్మిస్తారు. ఈ మూడు రిజర్వాయరు తాండవ నదీలోయ సమగ్ర అభివృద్ధికి సంకల్పించబడినట్టివి.

గోస్తనీ రిజర్వాయరు:- నిర్మాణానికయ్యే ఖర్చు రు 6618 వేలు 5 వేలు ఎకరాలకు లాభిస్తుంది. 917½ మిలియన్ ఘనపుటడుగుల పరిమాణంతో భీమవరం గ్రామంవద్ద గోస్తనికి రిజర్వాయరుకట్టి 20 మైళ్ల పొడవున కాల్వ త్రవ్వాలని ఉద్దేశం. ఈ రిజర్వాయరునుంచే విశాఖలోని నూనె పరిశుద్ధి కర్మాగారాలకు నీరు సరఫరా చేయాలని సంకల్పించబడింది.

శారదా రిజర్వాయరు:- వీరవల్లి తాలూకాలో రైవాడవద్ద శారదానదికి కట్టే రిజర్వాయరు ఇది. నిర్మాణానికి అయ్యే ఖర్చు రు 85 లక్షలు. రెండువైపులా రెండు పెద్ద తూములుంటవి. రాతికట్టు నిర్మించి కాల్వలలోకి సప్లయి చేస్తారు. ఈ ప్రాజెక్టుకు అయ్యేఖర్చులో కొంత వరద నివారణ పద్దుల కేటాయించిన మొత్తంలోనుంచి లభిస్తుంది. ఇది కూడా వరద నివారణ పథకమే. యీ ప్రాజెక్టువల్ల 60 వేల ఎకరాలకు ప్రయోజనం కలుగుతుంది.

తాండవ రిజర్వాయరు: గోలుగొండ తాలూకా గంటవారి కొత్తగూడెంవద్ద నిర్మించబడుతుంది. దీని నిర్మాణానికయ్యే ఖర్చు 60 లక్షలు. రిజర్వాయరుకు రెండుతూములు, రెండుకాల్వలు ఉంటవి. ఇదిగాక పులపర్తి కాల్వకోసం మరోతూము నిర్మించాలని ఆలోచనలో ఉన్నది. ఈ ప్రాజెక్టువల్ల 4500 ఎకరాలకు లాభిస్తుంది.

వరాహ రిజర్వాయరు: కొత్తకోట గ్రామానికి 3 మైళ్లు ఎగువన కల్యాణపురంలో లోవలో వరాహనదికి రిజర్వాయరు నిర్మిస్తారు. నిర్మాణవ్యయం 25 లక్షలు. ఇది యింకా సమగ్రంగా దర్యాప్తు చేయవలసి ఉన్నది.

### కర్నూలు జిల్లా

జుర్రేరు ఆనకట్ట: నిర్మాణానికయ్యే ఖర్చు రు 970 వేలు. దొడ్డజాల కొండలవద్ద జుర్రేరుకు రిజర్వాయరులు కట్టి, బంగనపల్లి సబ్ తాలూకాలో 1800 ఎకరాలకు క్రొత్తగా సాగులోకి తేవడానికి ఒక కాలువ త్రవ్వుతారు. సగిలేరు ఆనకట్ట:— నిర్మాణానికయ్యే ఖర్చు రు 1860 వేలు. గిద్దలూరువద్ద సగిలేరుకు ఆనకట్టకట్టి, రాచర్ల చెరువుకు ఒక సప్లయి కాల్వ త్రవ్వాలని సంకల్పం. ఈ ప్రాజెక్టువల్ల, రాచర్ల చెరువుకు నీరందడమే గాక, కంభం తాలూకాలో, యిప్పుడు సాగులో ఉన్న ఆయకట్టుకు స్థిరంగా నీరు సరఫరా అవుతుంది. గాజులదిన్నె ప్రాజెక్టు:— ఈ ప్రాజెక్టుకు అయ్యే ఖర్చు సుమారు 1 కోటి రూపాయలు పత్తికొండ తాలూకా గాజులదిన్నె గ్రామంవద్ద హంద్రి నదికి అడ్డంగా మట్టితో కట్టపోసి రిజర్వాయరు నిర్మిస్తారు. ఈ కట్టకు 14 తలుపులు అమర్చి, పెద్ద తూమునుంచి 18 మైళ్ల పొడవున ఒక కాల్వ త్రవ్వుతారు. కాలువ ప్రవాహ పరిమాణం 250 క్యూసెక్కులు క్రొత్తగా 600. ఎకరాలు సాగులోకి వస్తుంది.

వరదరాజప్రాజెక్టు: నిర్మాణానికి అయ్యేఖర్చు రు. 16 లక్షలు. శిథిలమైపోయిన కొరకుల, పోముల, పాలం చెర్వులకు నీరుసరఫరాచేసేందుకు యీ ప్రాజెక్టు సంకల్పించబడింది. రామాపురం, పెద్ద, చిన్నకల్లన్న చెరువులకు నీరందించే కాల్వకు అడ్డుకట్టలు వేసి, యీ పై చెర్వులకు నీరు సరఫరా చేస్తారు.

### అనంతపురంజిల్లా

దోరిగల్లుప్రాజెక్టు: నిర్మాణానికి అయ్యేఖర్చు రు. 1250 వేలు. కదిరి తాలూకా దోరిగల్లు శివారు అడవి బాపనపల్లి వద్ద మద్దిలేరుకు రిజర్వాయరు నిర్మిస్తారు. దిగువన నక్కలపల్లి వద్ద కట్టవేసి రెండువైపులా రెండుతూములు యేర్పాటుచేస్తారు. ఈ ప్రాజెక్టుక్రింద సుమారు 4 వేల ఎకరాలు సాగవుతుంది.

ధర్మవరం చెరువు ప్రాజెక్టు: తొగరకుంటకు అడ్డంగా ఒక ఆనకట్టకట్టి 20 మైళ్లపొడవున ఒక కాల్వ త్రవ్వి, ధర్మవరం చెరువుకు నీరు అందించాలని యీవిధంగా, ఎగువచెన్న రిజర్వాయరులో మిగులు నీటిని వినియోగించుకోవాలని, యీ ప్రాజెక్టు ఉద్దేశ్యం బుక్కపట్నం పథకానికి, దీనికి లంకె ఉన్నది. ఈ ప్రాజెక్టుక్రింద 2 వేల ఎకరాలకు లాభిస్తుంది.

బుక్కపట్నం చెరువు పథకం: దీని కయ్యే ఖర్చు రూ. 10 లక్షలు. ధర్మవరం చెరువు పెద్దకాల్వ అయిన బంగపేరులో కొంత నీటిని బుక్కపట్నం చెరువుకు మరల్చాలని యీ పథకం ఉద్దేశ్యం. ఈ చెరువుక్రింద 2 వేల ఎకరాలు సాగవుతుంది.

### కడప జిల్లా

చెయ్యేరు రిజర్వాయరు: దీని నిర్మాణానికయ్యే వ్యయం 1 కోటి రూపాయలు. పెన్నకు ఉపనదియైన చెయ్యేరుకు, రాజంపేట తాలూకా [illegible] శివారు [illegible]వద్ద 450 మిలియన్ ఘనపుటడుగుల ప్రమాణం ఎఫ్. ఆర్. ఎల్. × 660తో ఒక రిజర్వాయరు నిర్మిస్తారు. డాముకు కుడివైపున పెద్ద తూము, అమర్చి ఆ తూమునుంచి, కాల్వ త్రవ్వుతారు.

### చిత్తూరు జిల్లా

బాహుదా రిజర్వాయరు: దీని నిర్మాణానికయ్యే ఖర్చు రు. 80 లక్షలు. వాయల్పాడు తాలూకా, నిమ్మనపల్లివద్ద బాహుదా నదికి అడ్డంగా డాము నిర్మించి రిజర్వాయరు ఏర్పాటు చేయాలని యీ ప్రాజెక్టు ఉద్దేశ్యం. ఇది వాయల్పాడు తాలూకా సమాజవికాస కేంద్రం ప్రాంతంలో ఉన్నది. ఈ ప్రాజెక్టువల్ల 3 వేల ఎకరాలకు ప్రయోజనం కలుగుతుంది.

కల్యాణి రిజర్వాయరు:-దీని నిర్మాణానికయ్యే ఖర్చు రు. 1880 వేలు. నాపట్ల రిజర్వు అడవి ప్రాంతంలో కల్యాణికి రిజర్వాయరు నిర్మిస్తారు.

# జాతీయ సైనిక శిక్షణ దళం

## బాల భటులకు ప్రవేశార్హత

కర్నూలు, సెప్టెంబరు 5: వచ్చే విద్యాదినుంచి, బాల భటులుగా శిక్షణ పొందిన బాలబాలికలనే జాతీయ కేడెట్ దళంలో చేర్చుకుంటారని విశ్వసనీయంగా తెలియవచ్చింది.

ఇందుకు అనుగుణంగా, ఆంధ్రలో బాలభటఉద్యమ వ్యాప్తికై 1500 మంది ఉపాధ్యాయులకు శిక్షణ ఇప్పించాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

ఇప్పుడు మామూలుగా కేడెట్ దళానికి పాఠశాల, కళాశాల విద్యార్థుల నుండి యువతీ యువకులను తీసుకుంటున్నారు.

క్రమశిక్షణ బొత్తిగా ఎరగని వారికన్నా, శిక్షణ పొందిన 'స్కౌట్సు గైడ్సు' కేడెట్ దళంలో బాగా ఉపకరిస్తారని కేంద్ర విద్యాశాఖ భావిస్తున్నదట. ఈ దృష్ట్యా, బాలభట ఉద్యమాన్ని బాగా విస్తరింపచేయడానికి ప్రయత్నాలు చేయవలసిందని రాష్ట్ర ప్రభుత్వాలను కోరడం జరిగింది.

## ఆంధ్రలో 1500 మందికి శిక్షణ

ఆంధ్రలో బాలభటోద్యమ వ్యాప్తికై 1500 మంది ఉపాధ్యాయ ఉపాధ్యాయినులకు తరిఫీదు ఇప్పించాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నది. ఇందుకుగాను, ఈ ఉపాధ్యాయులకు రూ 10 చొప్పున భత్యం ఇప్పిస్తారు.

వచ్చే డిసెంబరులోగాని, జనవరిలోగాని, ఆస్ట్రేలియాలో జరుగనున్న అఖిల పసిఫిక్ బాలభట సమ్మేళనానికి ఆంధ్రనుండి పదిహేను ఇరవైమంది బాల భటులను పంపాలని రాష్ట్ర బాలభట సంఘం సంకల్పించింది.

## స్త్రీ కదా అని ఉద్యోగం ఇవ్వరు!

న్యూఢిల్లీ, సెప్టెంబరు 5: లేడీ హార్డింజ్ వైద్య కళాశాల ప్రిన్సిపాలుగా మగవారిని నియమించడం నేడు రాజ్యసభలో చలోక్తికి దారితీసింది. స్త్రీని యెందుకు నియమించలేదని శ్రీమతి సీతాపరమానంద్ ప్రశ్నించగా ఆరోగ్య శాఖ మంత్రి శ్రీమతి రాజకుమారి అమృతకౌర్ సమాధానమిస్తూ, రెండు మూడు సార్లు పత్రికలలో యీ ఉద్యోగం సంగతి ప్రకటించినా తగిన యోగ్యతలు గల స్త్రీ ఎవరూ కన్పించలేదని చెప్పారు. "అయినా కేవలం ఆడవాళ్లు కదా అని ఉద్యోగాని చ్చే రోజులు పోయాయని కొంత గుర్తించండి" అనేసరికి సభ్యులు బిగ్గరగా హర్షధ్వానాలు చేశారు. ఇంతకు ఆ ప్రిన్సిపాల్ వయస్సు 32 సంవత్సరాలు.

## తమిళ పండితునికి సన్మానం

అన్నామలైనగరం, సెప్టెంబరు 4: తమిళభాషకు, సాహిత్యానికి శ్రీ ఏ. చిదంబరనాథ చెట్టియార్ చేసిన సేవకు ప్రశంసా సూచకంగా ఆయనకు "పంతమిల్ కవలార్" (తమిళభాషకు యువరాజు) అనే గౌరవ బిరుదాన్ని శ్రీ సుబ్రహ్మణ్యదేశిక పరమాచార్యస్వామి వారు నేడిక్కడ జరిగిన ఒకసభలో ప్రసాదించారు.

శ్రీ చిదంబరనాథ చెట్టియారు అన్నామలై విశ్వవిద్యాలయ సిండికేటు సభ్యుడు, తమిళభాషాశాఖకు ప్రధానాచార్యులు.

## తిరుపతిలో ప్రాచ్య విద్యాపరిశోధన

తిరుపతి, సెప్టెంబరు 4: శ్రీ వెంకటేశ్వర ప్రాచ్య విద్యాపరిశోధనా కేంద్రాన్ని భండార్కర్ పరిశోధనా కేంద్రం స్థాయికి అభివృద్ధి చెయ్యాలనీ, ప్రజాసామాన్యానికీ, సమాజానికీ ఉపయోగపడే పరిశోధనలను జరిపించాలనీ ఈ కేంద్రం క్రొత్త డైరెక్టరు శ్రీ జె. చెన్నారెడ్డి అన్నారు. చెన్నారెడ్డిగారి గౌరవార్థం మొన్న సభ జరిగింది.

కె. ఎస్. రామమూర్తిగారు డైరక్టరుకు స్వాగతం చెప్పారు. శ్రీయుతులు డి. లక్ష్మణమూర్తి, పి. బాలకృష్ణమూర్తి, ఆర్. శ్రీనివాసాచారియర్ గారలు ప్రసంగించారు.

## గోదావరి నీటిమట్టం తగ్గుదల

రాజమండ్రి, సెప్టెంబరు 4: గోదావరి వరదనీరు క్రమక్రమంగా తీసిపోతున్నది. ఇక్కడి రైలు వంతెనవద్ద ఆగస్టు 31 వ తేదీన 57.5 అడుగులు ఉన్న నీటిమట్టం నేటికి 52.5 అడుగులకు తగ్గింది.

ఈ ఏడాది గోదావరి వరదనీరు అందుకున్న గరిష్ఠప్రమాణం 60.2 అడుగులు. ఆగస్టు 30 న నీరు ఈ మట్టానికి వచ్చింది.

వరదవల్ల నిలిచిపోయిన పడవలూ, లాంచీలూ, గత రెండు రోజులుగా మామూలుగా రాకపోకలు సాగిస్తున్నవి.

### కృష్ణానది నీటిమట్టం

విజయవాడ, సెప్టెంబరు 4: నిన్న ఉదయం యిక్కడ కృష్ణానది నీటిమట్టం 9 అడుగులు పైగా ఉన్నది.

# అరబ్ రాజ్యాలకు రష్యా ఆయుధాలు ఇస్తానన్నది

## పాశ్చాత్యుల వైఖరి మారకపోతే తీసుకోక తప్పదని ఈజిప్ట్ ఉపప్రధాని ప్రకటన

కలకత్తా, సెప్టెంబరు 4: రష్యా ఆయుధాలను స్వీకరించడానికి ఈజిప్టు సిద్ధంగా వున్నదని ఉపప్రధాని గమాల్ సలెం నేడు విలేఖరుల గోష్ఠిలో వెల్లడించాడు. గమాల్ సలెం రంగూన్ నుంచి ఇవాళ మధ్యాహ్నం వచ్చాడు.

"యూరోపియన్ దేశాలు మాకు ఆయుధాలు సరఫరా చేయకుండా నిర్బంధాలు చేస్తున్నాయి. వాటిని తొలగించకపోతే, రష్యా ఆయుధాలు స్వీకరిస్తాం." అని చెప్పారు.

అరబ్ రాజ్యాలకు రష్యా ఆయుధాలు ఇవ్వనున్నదని ఇటీవల వెలువడిన వార్తలపై విలేఖరులు ప్రశ్నించగా, "అది నిజమే" అని గమాల్ సలెం అంగీకరించుతూ పై విషయాన్ని కూడా తెలియజేశాడు.

ఇండోనీషియాలో నూతనంగా ఏర్పాటైన ప్రభుత్వం బాండుంగ్ సభ ఆశయాలను, నిర్వచించిన సూత్రాలను దృష్టిలో వుంచుకుని ఆసియా-ఆఫ్రికా దేశాల ఐక్యత పెంపొందించేందుకు కృషి చేయగలదని చెప్పారు. గమాల్ సలెం ఇండోనీషియా కూడా పర్యటించారు.

విమానాశ్రయంవద్ద పశ్చిమబెంగాల్ కాంగ్రెసు కార్యదర్శి శ్రీ ఆర్. కె. మిత్ర, స్వాగతమిచ్చారు. తరువాత రాజభవన్‌కు తీసుకువెళ్లారు. గమాల్ సలెం ఇవాళరాత్రి ఇక్కడనుంచి బయలుదేరి రాజానగర్ వెడుతున్నాడు.

### పక్షం రోజులు పర్యటన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 5: ఈజిప్టు ఉపప్రధాని శ్రీ గమాల్ సలెం భారతదేశంలో ఒక పక్షం రోజులుంటారు.

రాజానగర్, సింద్రీ, భాక్రా, నంగల్, తిలయా ఆనకట్టలను దర్శించి సెప్టెంబరు 8 వ తేదీనాటికి ఢిల్లీ చేరుకొంటారు. ఈజిప్టు ఉపప్రధాని ఢిల్లీలో వున్న నాలుగు రోజుల లోను రాష్ట్రపతిని, భారత ప్రధానిని, ఉప రాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణన్‌ను, ఆర్థికమంత్రిని, ప్లానింగు కమిషను సభ్యులను కలుసుకొంటారు.

తర్వాత భాక్రానంగల్ ప్రాజెక్టును, చాండీఘర్, ఉస్మానియా విశ్వవిద్యాలయం, ఖడక్‌వాస్లాలోని జాతీయ రక్షణ శిక్షణాలయాన్ని దర్శిస్తారు. సెప్టెంబరు 16 వ తేదీన బొంబాయి నుంచి కైరో వెళ్తారు.

## రాజ్యాంగం: న్యాయవాదుల విధులు

తెనాలి, సెప్టెంబరు 4: ఆంధ్ర హైకోర్టు న్యాయమూర్తి శ్రీ పి. సత్యనారాయణరావు, అడ్వొకేట్ జనరల్ డి. నరసరాజు గారలు న్యాయశాస్త్ర పరిశీలక సంఘం సభ్యులుగా నియమితులైన సందర్భంలో తెనాలి పురపాలక సంఘం ఈ నెల మొదటి తేదీన వారికి పౌర సన్మానం చేశారు. పురపాలక సంఘం అధ్యక్షుడు శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తి స్వాగత పత్రం సమర్పించారు.

తెనాలి న్యాయవాదుల సంఘం కూడా శ్రీ సత్యనారాయణరావు, నరసరాజు గారలకు సన్మానం చేశారు. సభకు శ్రీ కోపల్లి నారాయణరావు అధ్యక్షత వహించి సన్మానపత్రం సమర్పించారు.

సత్యనారాయణ రావుగారు మాట్లాడుతూ ఇట్లా అన్నారు: "న్యాయశాస్త్ర సంస్కరణ గురించి పరిశీలన జరిపి నిర్మాణాత్మకమైన సూచనలు చేసేనిమిత్తం న్యాయవాదుల సంఘాలు ఉపసంఘాలను నియమించాలి. న్యాయశాస్త్ర సంస్కరణ విషయంలో ఈనాడు రెండురకాల అభిప్రాయాలు కనిపిస్తున్నవి. ప్రస్తుతం అమలులో ఉన్న చట్టాలను పూర్తిగా సంస్కరించి, న్యాయ నిర్వహణ పద్ధతులను ప్రస్తుత సమాజం అవసరాలకు అనుగుణంగా రూపొందించాలని కొందరు అంటున్నారు. ప్రస్తుతం అమలులోఉన్న చట్టాలను సంస్కరించరాదనీ ఉపయోగకరమైనదని అనుభవంలో ఋజువయిన వ్యవస్థను ఏమాత్రం మార్చకూడదనీ మరికొందరు అంటున్నారు. ఈ రెంటికీ సమన్వయం చేసే పద్ధతిని రూపొందించాలి. న్యాయశాస్త్ర పరిశీలక సంఘంతో న్యాయవాదుల సంఘాలు సహకరించాలి. ఈనాటి పరిస్థితులకు అనుగుణంగా చట్టాలను రూపొందించడానికి న్యాయశాస్త్ర పరిశీలక సంఘం కృషిచేస్తారని ఆశిస్తున్నాను."

న్యాయవాదుల సహకారంతో సంఘం తనపని సక్రమంగా నిర్వర్తించగలదని నరసరాజుగారు అన్నారు.

శ్రీయుతులు జి. రంగనాయకులు, వి. లక్ష్మీనారాయణగారలు కూడా ప్రసంగించారు. జి. రామస్వామిగారి వందనాలతో సభ ముగిసింది.

### ఆంధ్ర విశ్వవిద్యాలయ డాక్టరేట్ పట్టం

వాల్తేరు, సెప్టెంబరు 3: శ్రీ డి. [illegible], డి. ఎస్‌సి (భౌతిక శాస్త్రం) పట్టం యివ్వాలని, ఆంధ్ర విశ్వవిద్యాలయ సిండికేట్ నిశ్చయించింది.

## ఏలూరులో మరొక మార్కెట్

### స్థలం ఇప్పిస్తానని మంత్రి హామీ

(స్వకీయ విలేఖరి)

ఏలూరు, సెప్టెంబరు 4: ఈ ఉదయం ఏలూరు పురపాలక సంఘంచేసిన సన్మానానికి జవాబిస్తూ, రెవెన్యూమంత్రి శ్రీ కల్లూరి చంద్రమౌళి, పట్టణంలో నూతనంగా అభివృద్ధిచెందిన ప్రాంతాలైన అశోకనగర్, పత్తేబాద్, అమీనాపేటల ఉపయోగార్థం ఒక మార్కెట్టు నిర్మించేందుకు అవసరమైనస్థలం త్వరలోనే పురపాలకసంఘానికి లభించేట్లు చేస్తానని హామీ యిచ్చారు. ఈ స్థలం, పురపాలకసంఘం కోరినట్లు కౌలుకుమాత్రం కాకుండా, పూర్తిగా యిచ్చివేస్తామని కూడా చెప్పారు.

చంద్రమౌళిగారు తాడేపల్లిగూడెం తాలూకా వరద బాధిత ప్రాంతంలో పర్యటించి నిన్న రాత్రి యిక్కడకు వచ్చారు. ఈ రోజు కొల్లేరుప్రాంతంలో పర్యటించడానికి వేసుకొన్న కార్యక్రమం రద్దుచేసికొని, మళ్లీ వరదబాధిత ప్రాంతాలలోనే పర్యటించడానికి నిర్ణయించుకొన్నారు.

పురపాలకసంఘ అధ్యక్షులు శ్రీ వెంకట్రావు స్వాగతపత్రం సమర్పిస్తూ, పట్టణంలో నూతనంగా అభివృద్ధిచెందిన ప్రాంతంలో మూడవమార్కెట్టు నిర్మించేందుకు స్థలం అద్దెకు యిప్పించాలనీ, హరిజనులకు, యితర బీదలకూ నివేశన స్థలాలు యిచ్చేనిమిత్తం రవాణా బీడు ప్రాంతాన్ని ప్రభుత్వం స్వాధీనం చేసుకొని పురపాలక సంఘానికి యివ్వాలనీ కోరారు.

శ్రీ చంద్రమౌళి ఇలా సమాధానమిచ్చారు: "మార్కెట్టు స్థలం విషయంలో వెంటనే జిల్లా అధికారితో చెప్పి స్థలం మంజూరు చేయించడానికి చర్య తీసుకుంటాను. త్వరలోనే పురపాలకసంఘం మార్కెట్టు నిర్మించే అవకాశం లభిస్తుంది."

పురపాలకసంఘ ఉపాధ్యక్షులు శ్రీ గోపాలరావు నాయుడుగారి వందనాలతో సభ ముగిసింది.

### కాంగ్రెసువారితో ఇష్టాగోష్ఠి

ఉదయం చంద్రమౌళిగారు, జిల్లా కాంగ్రెసు కార్యాలయంలో కాంగ్రెసు సేవకులతో యిష్టాగోష్ఠి జరిపారు. సమావేశానికి, శ్రీ అల్లూరి బాపినీడు, డా॥ మూల్పూరు రంగయ్య, శ్రీమతి మూల్పూరు చుక్కమ్మ, వీరమాచనేని వెంకటనారాయణ, [illegible] వెంకటనారాయణ, దుగ్గిరాల రాజశేఖరరావు, అత్కూరి గోవిందాచారి, కొత్తమాసు కృష్ణారావు మొదలైనవారు హాజరయ్యారు.

ఉదయం 9 గంటలకు, రెవెన్యూబోర్డు సభ్యులు శ్రీ కె. ఎం. ఉన్నితన్, జిల్లాకలెక్టర్ ఎం. ఆర్. పాయ్, జమీందారీల కమిషనర్, ఆర్. వెంకటరెడ్డి, జిల్లా కాంగ్రెసు అధ్యక్షులు అల్లూరి బాపినీడు, వీరమాచనేని వెంకటనారాయణగారలతో కలసి చంద్రమౌళిగారు తాడేపల్లిగూడెం, కొవ్వూరు తాలూకాల్లోని వరదబాధిత ప్రాంతాలు చూచేందుకు వెళ్ళారు.

### వాణిజ్యమండలి విరాళం

వరదబాధితుల సహాయం నిమిత్తం ప. గోదావరిజిల్లా వాణిజ్యమండలి సమాఖ్య అధ్యక్షులు కట్టా సుబ్బారావుగారు ఈ ఉదయం 50 చీరలు, 20 పంచల జతలు చంద్రమౌళిగారికి విరాళంగా యిచ్చారు. (స్వ. వి.)

## కడప విద్యార్థుల సమ్మె ఉపసంహరణ

కడప, సెప్టెంబరు 2: ఆగస్టు 30 వ తేదీన పాఠశాలకు తాము హాజరు కానందుకు క్షమాపణ చెబుతూ, కడప పురపాలక సంఘ ఉన్నత పాఠశాల విద్యార్థులు నిన్న సభజరిపి ఒక తీర్మానం చేశారు.

పాఠశాల ప్రధానోపాధ్యాయుడు ఆపదవికి అనర్హుడని, ఆయనను తొలగిస్తూ విద్యాశాఖ డైరెక్టరు ఉత్తర్వులు ఇచ్చినందుకు నిరసనగా నిన్న విద్యార్థులు పాఠశాలకు వెళ్లలేదు.

తరువాత జిల్లా కలెక్టరు జిల్లా విద్యాశాఖాధికారీ విద్యార్థులు ఇలా సమ్మె చేయుటం తగదని నచ్చచెప్పిన మీదట నిన్న సభజరిపి పైతీర్మానం చేశారు. [illegible] ప్రధానోపాధ్యాయుని పట్ల తమకుగల గౌరవ [illegible] లను సూచించుచున్నామనీ ఈ తీర్మానంలో వివరించారు. (స్వ. వి.)

## ఆంధ్రలో దేశీయ వైద్యకళాశాల

### అనవసరమని విజ్ఞప్తి

గుంటూరు, సెప్టెంబరు 4: ఆంధ్రలో దేశీయ వైద్యకళాశాలను ఏర్పాటుచేయడం డబ్బు దండగచేసే అవుతుంది కనుక అటువంటి ఆలోచనేమన్నా ఉంటే విరమించుకోవలసిందిగా ప్రభుత్వానికి విజ్ఞప్తిచేస్తూ భారత వైద్య మండలి ఆంధ్రరాష్ట్రశాఖ గౌరవ ప్రధానకార్యదర్శి జి. వి. హనుమంతరావు ఒక ప్రకటన చేస్తున్నారు. "ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ననుసరించి ఆంధ్రలో వీలైనన్ని ఎక్కువ వైద్యకళాశాలలను నెలకొల్పించే విషయమై కృషి చెయ్యాలి. ఇప్పుడు ఆంధ్రలోఉన్న జి.సి.ఐ.ఎం. డిగ్రీలున్న వారు వైద్యకళాశాలలలో చేరి ఆధునిక వైద్యంలో స్వల్పకాలిక శిక్షణ పొందే ఏర్పాటుచేసి, కృతార్థులైనవారికి ఎమ్. బి. బి. ఎస్. డిగ్రీలను ఇవ్వవచ్చు. అచ్చమైన దేశీయ వైద్యకళాశాల కావాలని ప్రజలు కోరడంలేదు. ప్రభుత్వానికికూడా అటువంటి కళాశాల నెలకొల్పే ఉద్దేశం ఉన్నట్లు కనిపించదు. ఆధునిక వైద్యంలోకూడా శిక్షణనిచ్చే సౌకర్యంతో ఆయుర్వేద వైద్యకళాశాలను నెలకొల్పే విషయం ప్రభుత్వ పరిశీలనలో ఉన్నది. వాస్తవానికి దేశీయ వైద్యంలో మాత్రమే డాక్టరు తయారు కావాలంటే ఒక సంస్థలో చేరి నాలుగు సంవత్సరాలు నేర్చుకోవలసినంతటి విశేషమేమీ అందులోలేదు. కేవలం ఆ పద్ధతిలోనే వైద్యం చెయ్యాలనే దృష్టితోకాక విషయగ్రహణకూ, పరిశోధన చెయ్యడానికీ మాత్రం ఆ వైద్యవిధానం నేర్చుకోవాలి. తాము చేసేది ఆధునిక వైద్యమేనని జి. సి. ఐ. ఎమ్. డిగ్రీల డాక్టర్లు బహిరంగంగానే చెబుతున్నారు. మనంకూడా అదే చూస్తున్నాం. దేశీయ వైద్య విధానానికి సంబంధించిన పరిశోధనాలయం లేక పోవడం, మందులకు ప్రమాణం నిర్ణయించక పోవడం ఆ విధానం అభివృద్ధికి అవరోధాలనే విషయంలో అనుమానమేమీ లేదు. దేశీయ వైద్య విధానంలో వాడే మంచిమందులను పెద్దపెట్టున తయారుచేయడం సాధ్యంకాదు. ఇందుకు జరిగిన కృషి విఫలమైంది. ఈ కారణంవల్లనే ప్రభుత్వ ఆసుపత్రులలో దేశీయ వైద్య చికిత్సా విభాగాల నేర్పాటు చేయడం సాధ్యం కాకపోయింది. ఆధునిక వైద్య కళాశాలల్లో ప్రవేశం లభించని యువకులు ఇక చేసేదేమీ లేక దేశీయ వైద్య కళాశాలలో చేరిన విషయం అందరికీ తెలిసినదే. ఇటువంటిపరిస్థితులలో దేశీయ వైద్య కళాశాలలో శిక్షణ పొందిన వారి శక్తి సామర్థ్యాలను ప్రజలు అనుమానించడంలో వింతయేమీ కనిపించదు. ప్రాచీన ఆధునిక వైద్య విధానాలలో శిక్షణ పొందామని వారు చెప్పినా అంత ప్రయోజనం కనిపించడం లేదు."

## దక్షిణాఫ్రికా మిశ్రమ జాతులు

### నీగ్రోలుగా జమ కాకుండా అపీలు

ప్రిటోరియా, సెప్టెంబరు 4: ఇటీవల ప్రభుత్వ నిర్ణయంప్రకారం నీగ్రోలుగా జమకట్టబడ్డ మిశ్రమజాతి ప్రజలు తిరిగీ తమ వాదాన్ని వినిపించుకునేందుకు విట్‌వాటర్స్ రాండ్‌లో ఒక అపీలు బోర్డును ఏర్పాటు చేస్తామని దక్షిణాఫ్రికా దేశీయాంగమంత్రి డా॥ థియొడోర్ డాంగ్స్ నేటిరాత్రి ప్రకటించారు. అపీళ్లకోసం 30 రోజులు జాతి నిర్ణయం చర్యలు నిలుపబడుతవని అన్నారు.

ఈ జాతి నిర్ణయంకోసం పోలీసులు పట్టుకుని పరిశీలన జరిపిస్తున్నారని వచ్చిన ఆరోపణలకు అయన జవాబిస్తూ, ఆఫ్రికన్ ప్రజలకు ఇచ్చే అనుమతి పత్రాలు లేకుండా తిరుగుతున్న ఆఫ్రికన్లపై నిర్బంధంగా పరీక్ష చేయటం జరుగుతున్నదని అన్నారు.

## వాల్తేరు కలకత్తా రైలు మార్గం

కలకత్తా, సెప్టెంబరు 4: ఆగ్నేయ రైల్వేమార్గం కటక్ - భద్రక్‌ల మధ్య ఇవాళ సాయంత్రం 4 గంటల నుంచి తిరిగి రైళ్లు యథాప్రకారం నడుస్తున్నాయని రైల్వే అధికారులు ప్రకటించారు. [illegible] మూలంగా నేటి తెల్లవారుఝామున 1 గంటనుంచి రైళ్ళు ఆగిపోయాయని ఇంతకుముందు వార్తలు వచ్చాయి.

ఇక్కడకు ఇవాళ 10-30 కు రావలసివున్న మద్రాసు, కలకత్తా మెయిలు రేపు తెల్లవారుఝామున 5 గంటలకు, జనతా, పూరీ - కలకత్తా ఎక్స్‌ప్రెస్‌ల ప్రయాణీకులతో సహా చేరుకుంటుంది.

### శ్రీమతి విజయలక్ష్మి

లండను, సెప్టెంబరు 4: స్కాట్లండులో 9 రోజులు పర్యటించిన అనంతరం శ్రీమతి విజయలక్ష్మి నేడు తిరిగి లండను వచ్చింది. ఈమె ఎడిన్‌బరో [illegible] ఉత్సవాల్లో పాల్గొన్నది. [illegible] ఎంతో ఉత్సాహం, శ్రద్ధ చూపారని శ్రీమతి విజయలక్ష్మి చెప్పారు.

## సిద్ధేశ్వరం ప్రాజెక్టు కరువు నిర్మాణంగా ప్రారంభించాలి

### కర్నూలుజిల్లా కాంగ్రెసు తీర్మానం

కర్నూలు, సెప్టెంబరు 5: కర్నూలు జిల్లా కాంగ్రెసు సభ్యులు నిన్న ఇసకోల కృష్ణస్వామి సత్రములో పెండెకంటి వెంకటసుబ్బయ్యగారి అధ్యక్షతన సమావేశమై వేరుశెనగ ఉత్పత్తిదార్ల మహాసభను ఈ నెలలోనే కర్నూలులో జరపాలని నిశ్చయించారు. ఇప్పటివున్న జిల్లా కాంగ్రెసు ఆఖరు సమావేశం యిదే.

ఈ నెలలో జరగబోయే వేరుశెనగ ఉత్పత్తిదారుల మహాసభలో వేరుశెనగ, ప్రత్తి మొదలగు వాణిజ్యపంటలకేగాక, ఆహారధాన్యాల ధరల స్థిరీకరణ విషయం గూడా చర్చ జరుగుతుంది. మహాసభకు వేరుశెనగ ఉత్పత్తిదారులనేగాక, నూనె మిల్లులవారిని కూడా ఆహ్వానించాలని నిశ్చయించారు.

నిన్నటి సమావేశాన్ని ఉపక్రమిస్తూ, గ్రామ, మండల సంఘాలను ఏర్పాటుచేసి కాంగ్రెసువారు, ప్రభుత్వానికి ప్రజలకు మధ్య అనుసంధాన కర్తలుగా ఉండాలని, ప్రభుత్వము సంకల్పించిన నిర్మాణ కార్యక్రమాలు జయప్రదం కావడానికి సంపూర్ణ సహకార మివ్వవలెనని, అధ్యక్షులు వెంకటసుబ్బయ్యగారు విజ్ఞప్తి చేశారు.

"ధరలు ఉన్నప్పుడు పంటలేక, పంట ఉన్నప్పుడు ధరలేక, రైతులు నష్టపడుతున్నారు. దీనికితోడు రైతు అవసరాలకు కావలసిన వస్తువుల ధరలు తగ్గలేదు. ధరలు స్థిరీకరించడం, సిద్ధేశ్వరం ప్రాజెక్టును క్షామనివారణ పథకంగా ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో చేర్చడం అవసరము. ప్రాతినిధ్యము లోపమువల్ల వెనుకబడిన రాయలసీమకు పనులు నెరవేరటం లేదు" అని సుబ్బయ్యగారన్నారు.

మహబూబ్ అలీఖాన్, ఎ. ఇ. తిప్పన్న, మద్దూరు సుబ్బారెడ్డి, దోర్నాల వెంకటరత్నంగారలుకూడా మాట్లాడారు.

### మంత్రి సలహా

సహకారమంత్రి శ్రీ సంజీవయ్యగారు మాట్లాడుతూ యీ సలహాయిచ్చారు. "ఆందోళన లేనిది యే పని నెరవేరదు. అందువల్ల, పంటల ధరల స్థిరీకరణ సిద్ధేశ్వరం ప్రాజెక్టు విషయమై ఆందోళన చేయడం సబబుగానే ఉంటుంది. ఆందోళనవల్లగాని, కనీసము వాస్తవ పరిస్థితులను తెలుసుకోవడానికి అవకాశము ఏర్పడదు."

కాంగ్రెసును పటిష్టం చేయడం గురించి అధ్యక్షులు చెప్పారు. "ప్రతి గ్రామంలో కాంగ్రెసు సంఘం ఉండాలి. నిధిని వసూలుచేసి, జీతములతో కూడా కొంతమంది కార్యకర్తలను నియమించడం అవసరం. కాంగ్రెసు కార్యాలయానికి స్వంతభవనము కూడా ఒకటి చాలాముఖ్యం" భూదానయజ్ఞం విషయం మాట్లాడుతూ ఎవరు పడితే వారిని, కార్యకర్తలుగా నియమించక బాధ్యతతో ఋజుప్రవర్తన గల వారిని కార్యకర్తలుగా యేర్పర్చడం ముఖ్యం అన్నారు.

### తీర్మానాలు

గోవా సత్యాగ్రహంలో ప్రాణాలు కోల్పోయిన వీరులకు జోహార్లర్పించి, గోవా అనతికాలంలో, భారతదేశములో విలీనము కాగలదని, ఆశిస్తూ, ఒక తీర్మానం చేశారు. గోవా అమరవీరుల ఆత్మశాంతి నిమిత్తము రెండు నిముషాలపాటు, మౌనంగా నిల్చుని ప్రార్థన చేశారు.

సిద్ధేశ్వరం ప్రాజెక్టును రెండవ పంచవర్ష ప్రణాళికలో చేర్చాలని కోరుతూ, యీ విషయాన్ని రాష్ట్ర కేంద్రప్రభుత్వాల దృష్టికి తెచ్చేందుకు, యీ నెలలోనే, సిద్ధేశ్వరం ప్రాజెక్టు మహాసభ జరుపడానికి నిశ్చయించారు. 1956 మార్చిలో జరుగనున్న రాజ్యసభ ఎన్నికలలో, కనీసము మూడుస్థానాలు, రాయలసీమకు, యిప్పించాలని కోరుతూ, ఈ కోర్కె శాసనసభ కాంగ్రెసుపక్ష నాయకుని దృష్టికి తీసుకొని రావాలని పార్టీ కార్యదర్శి విజయభాస్కర రెడ్డి గారిని ఆదేశిస్తూ తీర్మానించారు.

వినోబాజీ ఆంధ్రదేశ పర్యటన ప్రారంభించేలోగా, కర్నూలుజిల్లాను కేటాయించిన, పదివేల ఎకరాలను సేకరించడానికి ప్రతి కాంగ్రెసు వాది సహకరించాలని కోరుతూ యింకో తీర్మానం చేశారు.

రాజోలి బండ ఆనకట్ట నిర్మాణమును మంజూరు చేసినందుకు, ప్రభుత్వాన్ని అభినందించారు. తుంగభద్రమీద, కర్నూలువద్ద వంతెన నిర్మాణానికి గూడా, వెంటనే పూనుకోవాలని ప్రభుత్వాన్ని అర్థించారు.

జిల్లా కాంగ్రెసు అధ్యక్షులుగా గత రెండు సంవత్సరాలనుండి పెండెకంటి వెంకట సుబ్బయ్యగారు చేసిన సేవను, సి. ఎం. రామయ్యగారు ప్రశంసించారు.

## తెనాలి పోస్టాఫీసు డబ్బు చోరి

తెనాలి, సెప్టెంబరు 3: హెడ్ పోస్టాఫీసుకు చెందిన పోస్టు జవాన్ వీస్. ఆంజనేయులు వద్దనుండి రు 140/లు పోయినట్లు తెలిసింది. అతను పోస్టాఫీసులో ఉండగానే, యీ చోర్య జరిగిందట.

పోస్టుమాస్టరు ఈ సంగతి సూపరింటెండెంటు (గుంటూరు) కు ఫిర్యాదు చేశారు. పోలీసులు దర్యాప్తు చేస్తున్నారు

## గంగలో రెండు పడవల మున్క

### 26 మంది కన్పించడం లేదు

బెనారస్, సెప్టెంబరు 4: యాత్రికులను తీసుకుని వెడుతున్న రెండు పడవలు నేడు గంగానదిలో మునిగిపోయాయి. 26 మంది మునిగిపోయి వుంటారని భావిస్తున్నారు. ఇందులో ఎక్కువమంది స్త్రీలు. రెండింటిలోను 42 మంది వున్నారట. అందులో 26 మందిని సురక్షితంగా గట్టుకు చేర్చగలిగారు.

ఒక పడవ లలితాఘాట్ సమీపంలోను, మరొకటి రాంఘాట్ వద్ద మునిగిపోయాయి.

## మితవాద మొరాకో నాయకుని హత్య

కాసబ్లాంకా, సెప్టెంబరు 4:— మొరాకో జాతీయవాదుల పక్షం ఇస్తిక్‌లాల్ నాయకుల్లో మితవాదిగా పేరుపడ్డ సిద్దీ మహమ్మద్ బిన్ బరాదా నేడిక్కడ తనఇంటి వాకిట్లో నిలిచి ఉండగా హత్యచేయబడ్డాడు. పోలీసులు వచ్చేటప్పటికి గడపమీద పడ్డ రక్తం కడిగివేసి ఉన్నది. ఆయన కొడుకులు తమకేమీ వినబడలేదని అన్నారు.

బరాదా తుపాకితో కాల్చబడ్డాడు. ఆస్పత్రికి తీసుకుని వెడుతుండగా మరణించాడు.

15 నెలలకిందట కూడా ఆయనమీద ఎవరో బాంబు విసరగా ప్రమాదంతప్పి బయటపడ్డాడు.

## వ్యవసాయానికి అణుశక్తి

### ఆసియాలో అవసరం

హైదరాబాదు, సెప్టెంబరు 4: అణువిజ్ఞాన ప్రయోజనాలు ఇకముందు వ్యవసాయ రంగంలో ఎక్కువగా కన్పించవచ్చని టోకియో విశ్వవిద్యాలయ వృక్షశాస్త్ర ఆచార్యుడు షింగో మిట్సూయి నేడిక్కడ అఖిలభారత శాస్త్రవిజ్ఞాన సేవకుల సంఘ స్థానికశాఖ సమావేశంలో ప్రసంగిస్తూ అన్నారు.

శ్రీ షింగో మిట్సూయి అణుశక్తిపై జెనీవాలో జరిగిన సమావేశాలకు జపాన్ ప్రతినిధులలో ఒకరుగా వెళ్ళారు.

ఒక్క వ్యవసాయ శాస్త్రజ్ఞుడినైనా ఆ సభలకు భారతదేశం పంపకపోవడం దురదృష్టమని మిట్సూయిఅన్నారు.

మొక్కల పెంపకం, ఆహార ధాన్యాలనిల్వ, ఎరువులను శాస్త్రీయ పద్ధతులపై వాడటం, ఈ మూడు రంగాల్లోను, అణుశక్తి ప్రయోజనాలు మనం చూడవచ్చని, ఇందుకు అమెరికాలో వ్యవసాయరంగంలో జరుపుతున్న పరిశోధనలు ఆధారమనీ చెప్పారు.

"ఆసియాదేశాలకు వరిపంట ఎంతో ముఖ్యం. ఇందులో ఎన్నో అభివృద్ధికర మార్పులు అవసరం. బియ్యం ఉత్పత్తి రెట్టింపు జరిగితే ఆసియాలో జనాభా పెరుగుదల అనేది ఒక సమస్యేకాదు. అలాగే ఆహారధాన్యాల నిల్వ విషయంలో అణువిజ్ఞాన ప్రయోజనాలు లభిస్తే ప్రస్తుతం 100 కి 10 వంతులు వృథా అవుతున్న సరుకు ఏమాత్రం ఇక చెడదు. ఎరువులవాడకం, అత్యంతఆధునికమైన శాస్త్రీయ పద్ధతులపై వాడితే, వృథాఖర్చు చాలా తగ్గుతుంది." అని వివరించారు.

## తూర్పుకృష్ణా రాజకీయ బాధితులు

గుడివాడ, సెప్టెంబరు 2: తూర్పుకృష్ణాజిల్లాలో రాజకీయ బాధితుల సమస్య విషయమై తగిన చర్యలు తీసుకోవలసిందని ప్రభుత్వాన్ని కోరుతూ ఆగస్టు 30 వ తేదీ సాయంకాలం రహదారీబంగళాలో ఈడ్పుగంటి లింగయ్యగారి అధ్యక్షత సమావేశమై తూర్పుకృష్ణా రాజకీయ బాధితుల సంఘం తీర్మానించింది.

రాజకీయ బాధితు లెక్కడనైనా మూడు ప్రదేశాలలో భూములు కోరుకోవలసిందని నోటీసులు వచ్చాయనీ, అయితే ఈ భూము లెక్కడ ఉన్నాయో రాజకీయ బాధితులకు తెలియడంలేదనీ, భూములు ఖాళీగా తాలూకా ఆఫీసులలో ప్రకటించాలనీ కోరుతూ ఈ సంఘం మరొక తీర్మానం ఆమోదించింది.

మండలపాక గొల్లపాలెం ప్రాంతాలలో రాజకీయ బాధితులకు భూములు మంజూరై అయిదు సంవత్సరాలు గడిచినా నీటిసౌకర్యాలు లేకపోవడంవల్ల సాగుజరగడం లేదనీ వెంటనే నీటిసౌకర్యాలు ఏర్పరచవలసిందనీ లేకపోతే వేరే ప్రాంతాలలో భూములిప్పించవలసిందనీ కోరుతూ ఇంకొక తీర్మానం ఆమోదించింది. కలెక్టర్ల ఆఫీసులలో అశ్రద్ధవల్ల కొన్ని దరఖాస్తులు పోయాయనీ, [illegible] వారివద్దనుంచైనా తిరిగి దరఖాస్తులు తీసుకోవలసిందనీ కోరుతూ తీర్మానించారు.

## వరదనీరు ఇప్పుడే తీయదు

### శ్రీ చంద్రమౌళి వివరణ

### ఇళ్ల స్థలాలు ఇచ్చే ఏర్పాట్లు

భీమవరం, సెప్టెంబరు 5: పొలాలన్నిటినీ ముంచివేసిన వరదనీరు దానంతట అదే చప్పున తీసిపోయే అవకాశం కనబడనందువల్ల, ఆ నీటిని తీసివేయడానికి సూపరింటెండెంటు ఇంజనీరు, కలెక్టరు ఇతరమార్గాలు ఆలోచించి వెంటనే చర్యలు తీసుకోబోతున్నారని రెవిన్యూ మంత్రి చంద్రమౌళిగారు నిన్న ఇక్కడ విలేఖరులకు చెప్పారు. ఇందువల్ల ప్రస్తుతం, పంటలు, మరింత దెబ్బతినకుండా జాగ్రత్త తీసుకోవచ్చుననీ, వచ్చేనెల ఈ అధికారులు ఇద్దరూ తిరిగీ ఇక్కడికి వచ్చి, తగు కట్టుదిట్టాలు చేస్తారనీ ఆయన చెప్పారు.

మంత్రి నిన్న ఇక్కడకువచ్చి గరగపర్రు, పైప, కోరుకల్లు, మోగల్లు మొదలైన వరదప్రాంతాలను చూచారు.

మంత్రి తరువాత విలేఖరులతో మాట్లాడుతూ, ఈ ప్రాంతంలో వరదలు అకస్మాత్తుగా వచ్చిపడ్డాయనీ, ఎంత నష్టం వాటిల్లినదీ ఇప్పటికిప్పుడు చెప్పలేమనీ అన్నారు. నష్టంగురించిన వివరాలు తెలిసిన తరువాత ఈ విషయమై తగు చర్య తీసుకుంటామన్నారు. ఈ వరదలవల్ల, ఇళ్లు పోగొట్టుకున్న పేదసాదలందరికీ, ఎత్తుగాఉన్న ప్రాంతంలో, తాత్కాలికంగా ఇళ్లకు స్థలాలు ఇస్తామని, శాశ్వతసహాయం విషయమై, క్రమేపీ ఏర్పాటుచేస్తామని చంద్రమౌళిగారు తెలియచేశారు. [illegible] అక్కడ రెగ్యులేటర్ బ్రిడ్జి కట్టించాలన్న విజ్ఞప్తికి జవాబుగా, అది ఈ సమయంలో సాధ్యపడే పని కాదని చెప్పారు.

### విరాళాలు

ఈ పర్యటనలో, మంత్రి వరదవల్ల నష్టపడ్డ జనం కొందరికి అప్పటికప్పుడే డబ్బు మంజూరు చేయించి సహాయపడ్డారు.

ఈ ప్రాంతపు వరద బాధితులకు సహాయానికై, జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు అల్లూరి బాపినీడుగారు వెయ్యి, శాసనసభ్యుడు మూర్తిరాజుగారు రు 500 విరాళం ఇచ్చారు. (స్వ. వి)

## తోడుదొంగ అరెస్టు

### సుజాత్‌నగర్‌నుంచి పనిచేస్తున్నముఠా

కొత్తగూడెం, సెప్టెంబరు 3: సుజాత్‌నగర్‌లో కొత్తగూడెం పోలీసులు ఇటీవల అరెస్టుచేసిన పంచాయతీ బోర్డు సభ్యుడు సీతారామయ్య అనుచరుడు నాగయ్య అనే మరోవ్యక్తిని అశ్వారావుపేట సబ్‌ఇన్‌స్పెక్టరు శ్రీ పురుషోత్తం పోలీస్ హెడ్ కానిస్టేబుల్ సంధానీ సహాయంతో నిన్న తిరువూరులో అరెస్టుచేశారు.

ఈ నాగయ్యకూడా గత 5 సంవత్సరాలుగా సీతారామయ్యతో పాటు సుజాత్‌నగర్‌లో మారుపేరుతో వ్యవసాయం వృత్తిగా కాలక్షేపంచేస్తున్నాడు. సీతారామయ్య అరెస్టయినాడని తెలియగానే నాగయ్య తనమామగారి ఊరైన తిరువూరుకు పారిపోయాడు. పోలీసులుమాత్రం అతనికొరకు అన్వేషణ మానలేదు. నాగయ్య తిరువూరులో ఉన్నాడని తెలుసుకొని అక్కడికివెళ్ళారు. ఆ ఊళ్లో తెలిసిన వారిద్వారా నాగయ్యను పట్టుకొనడానికి ప్రయత్నించగా పొలాలకు అడ్డంగా పరుగుప్రారంభించాడట. అట్లా 4 ఫర్లాంగులు అతనివెంట పరుగెత్తి ఎట్టాగైతేనేం చివరకు పోలీసులు నాగయ్యను పట్టుకున్నారు. అతనివద్ద కొంత చోరీఆస్తికూడా స్వాధీనంచేసుకున్నారట.

గత 2 సంవత్సరాలలో ఖమ్మంమెట్టు జిల్లాలోనూ, ఆంధ్రసరిహద్దు ప్రాంతంలోనూ జరిగిన 12 దొంగతనాలకు ఈ ముఠా యే కారణమని చెప్పబడుతోంది. నాగయ్యను కొత్తగూడెం తీసుకువచ్చారు.

## తెనాలితాలూకా రోడ్లు

### వర్షాలవల్ల గండ్లు

తెనాలి, సెప్టెంబరు 4: తెనాలి నుండి వల్లభాపురం వెళ్లే రోడ్డుకు, మొన్న జూలైలో కురిసిన వర్షాలవల్ల గండ్లు పడ్డాయి. రోడ్డంతా చెడిపోయినందువల్ల బస్సులు నడవటం లేదు. అప్పటినుండీ వర్షాలు పడుతూనే ఉన్నందున వల్లభాపురం, మున్నంగి మొదలైన గ్రామాలనుండి తెనాలికి వచ్చేవారు నానా అవస్థలూ పడుతున్నారు. ఇంతవరకూ ఈ రోడ్డు మరమ్మతులకు జిల్లాబోర్డు చర్య తీసుకోలేదు.

తెనాలినుండి చెరుకుపల్లి వెళ్లేరోడ్డుకు కూడా వర్షాలవల్ల గండ్లు పడ్డాయి. రోజూ ఈ దారిన ఐదు బస్సులు తిరిగేవి. ఇప్పుడు రెండు బస్సులు నడుస్తున్నాయి. అవి అయినా అప్పికట్లవారకు వరకే నడుస్తున్నాయి. ప్రయాణీకులు చాలా ఇబ్బంది పడుతున్నారు. (స్వ. వి.)

## పోర్చుగీసుల కొత్త నిర్బంధ చర్యలు

### గ్రామాల మధ్య ప్యాస్ పోర్టులు!

బొంబాయి, సెప్టెంబరు 5: గోవాలో తీవ్ర మవుతున్న జాతీయోద్యమాన్ని అణచివేయుటానికి పోర్చుగీసు ప్రభుత్వం కొత్త నిర్బంధాలు విధించినట్లు గోవా జాతీయ కాంగ్రెస్ వర్గాలకు తెలియవచ్చింది.

ఈ నెల 1-వ తేదీనుంచి ఒకగ్రామంవారు ఇంకోగ్రామానికి గ్రామమునసబు అనుమతి లేకుండా పోరాదనీ, పట్నాలలో నివసించేవారు జిల్లా పరిపాలకుని అనుమతి పొందాలనీ ఉత్తరువు చేశారట. ఇది ప్రజలలో చాలా నిరసన కలిగించిందట. ఇటువంటి అనుమతులు జాతీయోద్యమంతో ఎటువంటి సంబంధంలేదని ఋజువు చేసుకోగలిగిన వారికే ఇస్తున్నారట.

### జైళ్ళలో దుర్భరస్థితి

పాన్‌జిం సమీపంలోని రీజ్ మాగోస్‌లో వుంచిన గోవన్ రాజకీయ ఖైదీల పరిస్థితి అంతకంతకు దుర్భరమవుతున్నదని తెలియవచ్చింది. ఇదివరలో ఈ ఖైదీలను ఆట్టే బాధించేవారు కాదట. మొన్న ఆగస్టు 15-వ తేదీనుంచి అక్కడి 105 గురు ఖైదీలనూ రోజు విడిచి రోజు బాదుతున్నారట. ఇప్పుడు అక్కడివారిలో దాదాపు ప్రతివారూ ఏదో ఒక రుగ్మతకు లోనైవున్నారనీ, వైద్యసహాయం లేనేలేదనీ తెలిసింది. హెన్రీ డిసూజా తీవ్ర దెబ్బలకు గురి అయి, ఇప్పుడు చాలా అపాయస్థితిలో పడివున్నాడట. ఇతని అపరాధం ఆమధ్య జైలు చూడవచ్చిన విదేశ విలేఖరులతో ఏమీ దాచకుండా వున్న విషయం వున్నట్టు స్వేచ్ఛగా తెలుపుతూ మాట్లాడటమట. నిరుడు ఆగస్టు 15 న గోవా సత్యాగ్రహులదళానికి నాయకత్వం వహించిన ఆంథోనీ డిసూజా మూత్రపిండం జబ్బుతో బాధపడుతున్నారట. ఈయనకు 28 ఏండ్లు కారాగారవాసం విధించారు. ఆనాస్టాసియో అల్మీడా అనే ఆయన గూబ పగిలి చెవుడు వచ్చిందట. వీరిని బాధించటానికి కారణం మొన్న ఆగస్టు 15-న వీరంతా జైలులోనే స్వాతంత్ర్యోత్సవం జరపటమేనని తెలిసింది. ఆ రోజున వీరి నినాదాలతో జైలు మారుమ్రోగిపోయిందట.

### త్రిదీబ్‌చౌదరి ప్రభృతులపై అభియోగాలు

ప్రస్తుతం గోవాలో నిర్బంధింపబడి వున్న శ్రీ త్రిదీబ్‌చౌదరి ప్రభృతులపై పోర్చుగల్లు సార్వభౌమత్వాన్ని ఉల్లంఘించిన అభియోగాలు పెట్టటానికి పోర్చుగీసు అధికారులు నిర్ణయించినట్లు తెలిసింది.

పాన్‌జిం జైలులో నిర్బంధింపబడిన తన భర్త శ్రీ ఈశ్వర్‌లాల్ దేశాయ్‌ని చూడబోయిన శ్రీమతి కుసుమ్‌బెన్ దేశాయ్ ఈ సాయంత్రం కార్వార్ తిరిగివచ్చారు. ఆయన కులాసాగా వున్నారని ఆమె అన్నారు.

కమ్యూనిస్టు నాయకుడు శ్రీ ఎ. కె. గోపాలన్ ఆదివారం సాయంత్రం ఢిల్లీలో జరిగిన ఒక బహిరంగసభలో ఉపన్యసిస్తూ, కాంగ్రెసూ, భారతప్రభుత్వమూ, గోవా విమోచనోద్యమాన్ని, ఈ విషయంలో దేశంలోని అన్ని పక్షాల మధ్యాసాధింపబడిన సామరస్యాన్ని బలహీనపరచే ఏపనీ చేయరాదని అన్నారు. కాంగ్రెసు తనకు సత్యాగ్రహానికి ఇష్టపడకపోతే సత్యాగ్రహంలో బాధలు పడినవారికి చాలా నిరుత్సాహం కలుగుతుందన్నారు. భారతప్రభుత్వం పోర్చుగీసువారికి గోవానుంచి ఎప్పుడు వెళ్ళిపోతారో ప్రకటించవలసిందని అంత్యసందేశ మివ్వాలన్నారు.

కర్నూలు, సెప్టెంబరు 5: "మానవ తాత్కాలిక సమస్యలకంటే కూడా అధ్వాన్నంగా ఉన్నది. భీమా పద్ధతి అంటే నాకు నమ్మకం లేకపోలేదు. కాని, వాయిదా సొమ్ము కట్టగలనో లేదో అని జీవితాన్ని భీమా చేయించుకోలేదు. అని కర్నూలులో భీమా కంపెనీల సభలో మంత్రి సంజీవయ్య చెప్పకున్నారు.

## క్షయ టీకాలు

### రాజాజీ ప్రచారం నిరాధారం!

### శ్రీమతి అమృతకౌర్ వివరణ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 5: బి. సి. జి. టీకాలు వేయటంగురించి వైద్యుల అభిప్రాయాలు ప్రకటించరాదని నిషేధమేమీ పెట్టలేదని ఆరోగ్యశాఖమంత్రి రాజకుమారి అమృతకౌర్ ఇవాళ రాజ్యసభలో అన్నారు.

శ్రీ రాజగోపాలాచారి ఈ టీకాలవల్ల కలిగినట్లు వెల్లడించిన దుష్ఫలితాల సందర్భంలో దర్యాప్తులు జరిగాయనీ, ఆ ఆరోపణలు నిరాధారమైనవని తేలిందనీకూడా ఆమె అన్నారు.

అబద్ధపు ప్రచారం చేస్తున్నందుకు శ్రీ రాజగోపాలాచారిపై చర్యతీసుకొంటారా అని శ్రీ కొమ్మారెడ్డి సూర్యనారాయణ అడిగగా మంత్రి సమాధానం ఇవ్వలేదు.

ఈ విషయమైవచ్చిన ఇతర ప్రశ్నలకు జవాబుగా ఈ దిగువ అంశాలు ఆమె తెలిపారు: 1954 డిసెంబరునుంచి 1955 మే వరకూ దేశంలో 46,58,909 మందికి ఈ టీకాలు వేశారు. ఎవరికీ నిర్బంధంగా వేయలేదు. స్కూలు అధికారులద్వారా ముందుగా తెలియజేసి, క్షయక్రిములు వున్నదీలేనిదీ పరీక్షచేయటానికి ఒప్పుకొన్న వారికి ఆ పరీక్ష చేసి, ఆ క్రిములు లేవని తేలినవారికి టీకాలువేశారు. అటువంటి సందర్భాలలో టీకాలు వేయటానికి తల్లిదండ్రులు అంగీకరించినట్టే ఎంచాలి. ప్రతివారివద్దా అంగీకారం పొందటం ప్రభుత్వానికి సాధ్యంకాదు. స్కూలు అధికారులకు తెలిపితే, వారు తల్లిదండ్రులకు తెలియచేసివుంటారనీ, వారు అందుకు ఒప్పుకొనివుంటారనీ అనుకోవటం జరుగుతుంది.

సోవియట్ రష్యాలో ప్రతి బిడ్డకూ మూడవరోజున నిర్బంధంగా ఈ టీకాలు వేస్తారు. తర్వాత మళ్ళీ 5-వఏట వేస్తారు. అక్కడిమాదిరిగానే మనదేశంలో కూడా తీసుకోవలసిన ముందుజాగ్రత్తలన్నీ తీసుకోవటం జరుగుతున్నది.

ఇతర టీకాలమందువలెనే ఈమందు కూడా సజీవక్రిములతో కూడివుంటుంది. అంతేగాని క్రిములను వృద్ధిచేసే క్రిములు వుండవు. దేహంలోకి ఎక్కిస్తే ఇక వదిలిపెట్టవనేమాటఅబద్ధం. బ్రిటిష్ మెడికల్ జర్నల్ తాలూకు 1955 సంవత్సరం ఏప్రిల్ మాసపు సంచికలో బి. సి. జి. టీకాలవల్ల క్షయ రాగల అవకాశం వున్నదంటూ ఒక వ్యాసం వెలువడినమాట నిజమే. కాని బ్రిటన్ ఆరోగ్యశాఖవారు క్రిందటిమాసంలో ఒక ఉత్తరంవ్రాస్తూ, బ్రిటన్‌లో ప్రతి బిడ్డకూ 5-వ ఏట ఈ టీకాలు వేస్తున్నట్లు తెలియచేశారు.

### 'కాశ్మీర్ ప్రిన్సెస్' పైలట్ కుటుంబానికి విరాళం

నాగపూర్, సెప్టెంబర్ 5: కాశ్మీర్ ప్రిన్సెస్ విమానం విద్రోహుల చర్యవల్ల కూలిపోయినప్పుడు మరణించిన విమానచోదకుడు కెప్టెన్ జాథార్ కుటుంబానికి మధ్యప్రదేశ్ ప్రభుత్వం 7500 రూ॥ లు విరాళం ఇచ్చింది. ఈ డబ్బు జాథార్ ధైర్యసాహసాలకు పారితోషికంగా ఇవ్వబడ్డది.

విమానం పడిపోతున్నదని తెలిసినప్పుడు జాథార్ నేర్పుగా వ్యవహరించినందుకు భారత ప్రభుత్వం ఆయనకు మహావీరచక్ర ఇచ్చింది.

## కాంగ్రెసు సంస్థ నియమావళి

### ఉపసంఘ నివేదిక

### 'శాసన సభ్యుల నిర్బంధ విరాళం ఇవ్వాలి'

న్యూఢిల్లీ, సెప్టెంబరు 4: కాంగ్రెస్ సంస్థ నిర్వహణ వ్యవహారాలను పరిశీలించిన అఖిలభారత కాంగ్రెసు బృందం, వివిధ రంగాలలో కాంగ్రెసు అవలంబించే పద్ధతులలోనూ, కాంగ్రెసు నియమావళిలోనూ అనేక మార్పులు సూచిస్తూ ఒక నివేదికను తయారుచేశారు. దీనిని పరిశీలించి, తగు నిర్ణయాలు చేయవలసిందిగా కార్యవర్గాన్ని కోరాలని నేడు జరిగిన సమావేశంలో నిశ్చయించారు. ఈవ్యవహారాలు పరిశీలించిన ఈ బృందానికి లాల్ బహదూర్ శాస్త్రి అధ్యక్షులు.

#### జాతీయ కార్యకర్తలు

కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమాలకు శ్రీకారాలన్ని వినియోగించి పనిచేసే పద్ధతిలో ప్రతిజిల్లాలోనూ 'జాతీయ కార్యకర్తల' దళాలను ఏర్పాటు చేయాలని వీరు నివేదికలో సూచించారు. ఈ దళాల పోషణకే ఒక ప్రత్యేక నిధి ఏర్పాటు చేయాలనీ, ఖర్చులో అఖిల భారతకాంగ్రెసు సంఘం నూరింట 50పాళ్లు, ప్రదేశ్ కాంగ్రెసు 25 శంతులుమిగతాది జిల్లాకాంగ్రెసు భరించాలనివివరించారు.

#### అభివృద్ధి సంఘాలు

అభివృద్ధి వ్యవహారాలు చూచే నిమిత్తం నియమించే సంఘాలతో కాంగ్రెసు సభ్యులకు ఇతోధికంగా సంబంధాలు ఉండాలి. ప్రతి సంఘంలోనూ అనధికార సభ్యులకు తగినంతిగా ప్రాతినిధ్యం వుండాలి.

#### చిన్న సంఘాల పాలక వర్గాలు

చిన్న కాంగ్రెసు సంఘాల పాలక వర్గాన్ని నియమించేపద్ధతి తొలగించి, ఆ స్థానే, ఎన్నికలపద్ధతిని ప్రవేశ పెట్టాలనీ, ఇందుకు తగినవిధంగా కాంగ్రెసు నియమావళిని సవరించాలనీ ఒక సూచన చేశారు.

#### శాసన సభ్యులు విరాళం ఇవ్వాలి.

కాంగ్రెసు శాసనసభ్యులు అందరూ తమతమ వేతనాలలో పదవవంతును ప్రదేశ్ కాంగ్రెసు సంఘానికి విరాళంగా ఇవ్వాలని మరో సూచనచేశారు. ఈ అంశంపై ఈ బృందంలోని వారందరూ ఏకీభవించినట్లు నివేదికలో పేర్కొన్నారు. కాంగ్రెసు శాసన సభ్యులు ఇచ్చే ఈ విరాళాలను ప్రదేశ్ కాంగ్రెసు శాసన సభ కాంగ్రెసు పక్షానికీ, ఇతర కాంగ్రెసు సంఘాలకు తగునిష్పత్తిలో పంచి పెడుతుంది.

#### సంయుక్త పాలకవర్గం

ప్రదేశ్ కాంగ్రెసు, శాసనసభ కాంగ్రెసుపక్షాలవ్యవహారాలను సమన్వయించడానికై, ఈ రెండు శాఖలకూ కలిసి సమష్టి పాలకవర్గం ఒకటి ఏర్పాటు చేయడం అవసరమని ఒకసూచనచేశారు. కాని ఈ విషయమై జాగ్రత్తగా ఆలోచించకుండా, ఏ విధమైన నిర్ణయమూ చేయడం వీలు పడదని సభ్యులు అభిప్రాయపడ్డారు.

## మెయిలు ఆగే ఏర్పాటు

### తిరిగి చేయించాలని సోంపేట విజ్ఞప్తి

న్యూఢిల్లీ, సెప్టెంబరు 4: సోంపేట తాలూకా రైలుప్రయాణీకుల సంఘం కార్యదర్శి శ్రీ డి. యర్రయ్యవర్మ, వి. వీరయ్యగారలు ఈ నెల 2వ తేదీన కేంద్ర ప్రభుత్వ రైల్వేశాఖ మంత్రి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రిని కలుసుకొని తూర్పు రైల్వేలో సోంపేటవద్ద మెయిలు ఆగే ఏర్పాటు తిరిగి చేయించవలసిందిగా అభ్యర్థిస్తూ ఒక విజ్ఞప్తి సమర్పించారు.

నూరుమైళ్ళు అంతకంటే ఎక్కువ దూరం వెళ్లే ప్రయాణీకులు తగినంతమంది లేనందున సోంపేటలో మెయిలు ఆగే ఏర్పాటును ఫిబ్రవరిలో రద్దు చేశారు. ఇప్పుడు ఈ రాయబారవర్గం సమర్పించిన విజ్ఞప్తిలో ఇట్లా ఉన్నది: 16 సంవత్సరాలుగా మెయిలు సోంపేట స్టేషన్లో ఆగుతూ వచ్చింది. నెలకు రూ. 8 వేలకంటే ఎక్కువ ఆదాయమే ఈ స్టేషనువల్ల వచ్చింది. సోంపేట తాలూకా ప్రధాన కేంద్రం. ప్రభుత్వ కార్యాలయాలు అనేకం ఉన్నవి. ముఖ్యంగా కొబ్బరి, జీడిపప్పు, కొబ్బరి పీచు వాణిజ్యం అభివృద్ధిచెందే అవకాశాలున్నవి. సోంపేటలో మెయిలు ఆగే ఏర్పాటు చాలా అవసరం."

భువనేశ్వరం (మొరాకో), సెప్టెంబరు 5: 7 వేలమంది ఫ్రెంచికొల్పలం పాయుధ మోటార్లతోనూ, గస్తీ విమానాలలోనూ నిన్న ఉదయం భువనేశ్వరం ప్రాంతంలో పెద్ద ఎత్తున దైనికచర్య ప్రారంభించింది.

[illegible]

## రాజమండ్రి రోడ్డు మేస్త్రీలు

### 46 మందికి ఉద్వాసన

రాజమండ్రి, సెప్టెంబరు 3: ఆంధ్ర ప్రభుత్వ రహదార్లశాఖ రాజమండ్రి డివిజనులో పనిచేస్తున్న రోడ్డు మేస్త్రీలను నోటీసు యివ్వకుండా 18 మందిని తగ్గించివేశారనీ, మరో 28 మందిని సెప్టెంబరు 15 తేదీ నుంచి తీసివేయవలసిందిగా అసిస్టెంటు యింజనీర్లకు డివిజనల్ యింజనీరు ఉత్తర్వులుపంపారనీ తెలుస్తున్నది.

రోడ్లఖర్చు మంజూరును ప్రభుత్వం తగ్గించారుగనుక యీ విధంగా 46 మంది రోడ్డు మేస్త్రీలనూ తీసివేసి ఖర్చులు దించాలని డివిజనల్ యింజనీరు అభిప్రాయపడ్డారట. ఈ తీసివేయబడిన వారిలో చాలమంది 1952, 1953 నుంచీ పనిచేస్తున్నారు. ఇంటర్మీడియటు, మెట్రిక్యులేషన్ వరకూ చదువుకున్న వారుకూడా ఉన్నారు. (స్వ. వి.)

## బందరు పురపాలకసంఘం

### హోటలు యజమానికి పరిహారం

బందరు, సెప్టెంబరు 4: బందరులో ఒక హోటలు యజమానికి సంబంధించిన దావాలో పురపాలక సంఘం చేసిన అప్పీలును త్రోసివేస్తూ జిల్లా జడ్జి తీర్పు చెప్పారు. హోటలు యజమానికి పురపాలక సంఘం దావా ఖర్చులు కూడా యివ్వాలని నిర్ణయించారు.

ఈ కేసు వివరాలివి. లోగడ అర్థ సంవత్సరాలతో కలిపి ఇంటిపన్ను వసూలు చేసే సందర్భంలో చట్టంప్రకారం పురపాలకసంఘం అనుమతి పొందిన తరువాత నే కమీషనరు ఇంట్ల యజమానులకు పన్నులు చెల్లించమని కోరుతూ నోటీసులు పంపించాలి.

అటువంటి అనుమతి ఏమీ లేకుండానే హోటలు యజమాని శ్రీ డి. గోవిందరావుకు శ్రీమతి కె. లక్ష్మీకాంతమ్మకు కమీషనరు నోటీసులుఇచ్చారు. అట్లా చెయ్యడం చట్టానికి వ్యతిరేకం కనుక అవి చెల్లవని జిల్లా మున్సిఫ్ కోర్టులో దావాలువేశారు. కమీషనరు నిర్ణయించిన పన్ను మదింపు సక్రమమైంది కాదని తీర్పు చెప్పారు. ఆ తీర్పుపై సబ్ జడ్జి కోర్టులో అప్పీలుచేశారు. సబ్ జడ్జి విచారించి పురపాలక సంఘం హోటలు యజమానికి ఖర్చులు ఇవ్వాలని తీర్పు చెప్పారు. పరిహారం కింద రు. 100 చెల్లించాలని కూడా నిర్ణయించారు. ఆ తీర్పుపై జిల్లాజడ్జి కోర్టులో పురపాలక సంఘం అప్పీలు చేయగా అప్పీలును త్రోసివేస్తూ దావాఖర్చులు కూడా పురపాలకసంఘం చెల్లించాలని జడ్జి తీర్పు చెప్పారు.

పురపాలక సంఘం తరఫున ఆర్. సీతారామయ్యగారు, ప్రతివాదు ల తరఫున శ్రీ విన్నకోట ఉదయభీమరాజు పనిచేశారు.

తెనాలిలో మొన్న జరిగిన ఆంధ్రరాష్ట్ర శానిటరీ మేస్త్రీల తృతీయ మహాసభలో పాల్గొన్న వివిధ జిల్లాల ప్రతినిధులు. స్థానిక పరిపాలన మంత్రి డా॥ ఎ. బి. నాగేశ్వరరావుగారు సభను ప్రారంభించారు. తెనాలి పురపాలక సంఘాధ్యక్షుడు ఆవుల గోపాలకృష్ణమూర్తిగారు అధ్యక్షత వహించారు.

చీరాలలో ఆగస్టు 29 న జరిగిన గుంటూరుజిల్లా చేనేత మహాసభలో ప్రసంగిస్తున్న సహకార మంత్రి [illegible]య్యగారు. (ఎడమనుండి కుడికి) అన్నదాత నాగేంద్రుడుగారు, శాసనసభ్యులు మంతెన వెంకటరాజు, తాళ్లూరి జియ్యర్ దాసుగారలు సభాధ్యక్షుడు ప్రగడ కోటయ్యగారు, అక్కల కోటయ్యగారు.

శాంతి ప్రయోగాలకు అణుశక్తి వినియోగం గురించి జెనీవాలో జరిగిన అంతర్జాతీయ సభ అధ్యక్షుడు డా॥ హెచ్. జె. భాభా, సభ ఉపాధ్యక్షులు. (ఈ చిత్రంలో ఎడమనుండి కుడికి) డబ్ల్యు. బి. లూయిస్ (కెనడా) ఫ్రాన్సిస్ పెరిన్ (ఫ్రాన్స్), ఐ. ఐ. రబీ (అమెరికా) డా॥ భాభా (భారతదేశం), డి. వి. స్కొబెల్జిన్ (సోవియట్ రష్యా), జాన్. డి. కాక్రాఫ్ట్ (బ్రిటన్), జెర్నార్డినో డిమటాస్ (బ్రెజిల్),

ఆంధ్ర గవర్నర్ శ్రీ త్రివేదీ ఈనెల 8 వ తేదీన హైదరాబాద్ రాష్ట్ర శాసనసభను సందర్శించారు. ఈ చిత్రంలో శ్రీ త్రివేదీ కుడివైపున ఉన్నవారు శాసనసభ సభాపతి శ్రీ కాశీనాథరావ్ వైద్య. ఎదురుగా ఉన్నవారు హోంమంత్రి శ్రీ డి. జి. బిందూ.

తిరుపతిలోని శ్రీ వెంకటేశ్వర ప్రాచ్య విద్యాపరిషత్కు ప్రిన్సిపల్ గాను, పరిశోధనా సంస్థకు డైరెక్టర్ గాను నియమించబడిన కె. చెన్నారెడ్డిగారు.

తిరుపతిలోని శ్రీ వెంకటేశ్వర కళాశాల (పురుషుల)కు ప్రిన్సిపాల్ గా నియమించబడిన పి. వి. శేషగిరి రావుగారు.

కాశీ విశ్వవిద్యాలయంలో ఆంధ్ర సమితికి అధ్యక్షుడుగా ఎన్నికైన కె. వి. నారాయణగారు.

శ్రీ త్రివేది హైదరాబాద్ లోని చిక్కడపల్లి కార్మికవాడను సందర్శించారు. ఆయన వెంట ఉన్నవారు స్థానిక పరిపాలన మంత్రి శ్రీ గోపాలరావ్ ఎక్బోటే.

ఎం. మహమూదుహసన్ ఖాన్ [illegible] శాస్త్రం (స్టాటిస్టిక్స్) లో ఉన్నత విద్యాభ్యాసానికై మిన్నసోటా (అమెరికా) విశ్వవిద్యాలయానికి వెళ్తున్నారు. వీరి స్వస్థలం [illegible] తాలూకా [illegible] గ్రామం.

## దక్షిణాఫ్రికా భారతీయ సమస్య

### వచ్చేసమితి సమావేశంలో ప్రస్తావన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 5: వచ్చేఐక్య రాజ్యసమితి సమావేశంలో దక్షిణాఫ్రికా భారతీయ సమస్య తిరిగి చర్చకు వస్తుందని ప్రధాని శ్రీ నెహ్రూ నేడు లోక్ సభలో వెల్లడించారు.

"దక్షిణాఫ్రికా, పాకిస్థాన్, భారత దేశాలకు ఈ సమస్యపై మధ్యవర్తిగా బ్రెజిల్ ప్రతినిధి శ్రీ లూయిస్ డిస్టా రోను సమితి కౌన్సిల్ [illegible] నియమించారు. కాని ఆయనను సత్కరించటానికి దక్షిణాఫ్రికా ప్రభుత్వం నిరాకరించి, ఆవిషయాన్ని సమితి కార్యదర్శికి తెలియజేసిందని తెలుస్తున్నది. ఈసమస్య మళ్లీ సమితి సర్వసభ్యసమావేశంలోవస్తుంది.

దక్షిణాఫ్రికా జాతి సమస్యపై సమితి ఏర్పాటుచేసిన కమిషన్ సమితి సర్వసభ్య సభకు కిందటి సమావేశంలో ఒక నివేదిక సమర్పించింది. దక్షిణాఫ్రికా ప్రభుత్వం చేస్తున్న కొత్త శాసనాలు సమితి సూత్రాలకు విరుద్ధంగా ఉన్నవనీ చెప్తూ, వాటిని దక్షిణాఫ్రికా ప్రభుత్వం ప్రవేశ పెడుతున్నందుకు ఆందోళన వెల్లడిస్తూ సమితి ఒక తీర్మానం చేసింది. దక్షిణాఫ్రికా జాతి విభేదాలను కనిపెట్టి ఉంటూ వచ్చే సమావేశంలో తెలియ చేయ వలసిందని కూడా సమితికోరింది. ఈకమిషన్ ప్రస్తుతం దక్షిణాఫ్రికా జాతి సమస్యలను పరిశీలిస్తున్నదని శ్రీ నెహ్రూ వివరించారు.

## సెప్టెంబర్ సమావేశంలో జిల్లా బోర్డుల చర్చరాదు

### మరిమూడుమాసాలు స్పెషల్ ఆఫీసర్ల పదవీకాలం పొడిగింపు

కర్నూలు సెప్టెంబరు 5: శాసన సభ సెప్టెంబరు సమావేశంలో, జిల్లాబోర్డులు ఏర్పాటు చేయడానికి సంబంధించిన శాసనం ప్రవేశపెట్టడం సాధ్యంకాదనీ, అందువల్ల, జిల్లాబోర్డు స్పెషల్ ఆఫీసర్ల పదవీకాలం మూడు మాసాలు పొడిగించబడుతుందనీ స్థానిక పరిపాలన మంత్రి డా॥ఎ. బి. నాగేశ్వరరావుగారు ఇవాళ విలేఖరులకు చెప్పారు.

ఈ ప్రత్యేకాధికారుల పదవీకాలం 1955 డిసెంబర్ 10వ తేదీవరకూ పొడిగిస్తూ గవర్నరు ఆర్డినెన్సు జారీచేసిన విషయం విదితమే. ప్రభుత్వం నియమించిన మంత్రివర్గ ఉపసంఘం ఈ నెల మధ్యలో సమావేశమై, ఈ విషయాన్ని పరిశీలిస్తారు.

### లోక్ సభలో కనీస సంఖ్య సమస్య

న్యూఢిల్లీ, సెప్టెంబరు 5: లోక్ సభ మధ్యాహ్నం ఒంటిగంట రెండున్నరగా మధ్య సభ్యుల కనీస సంఖ్య లేకుండా సమావేశం సాగించటానికి వీలు కలిగిస్తూ ప్రభుత్వం ఏక నిబంధన చట్టాన్నొకదాన్ని తీసుకురావాలని ఇవ్వాళ లోక సభ సభాపతి శ్రీ జి. వి. మవులంకర్ కోరారు.

పని ఎక్కువగా వుంటున్నందున కొంతకాలంగా లోక సభ సమావేశాలు ఈవిధంగా జరుగుతున్నాయి. మొన్న శుక్రవారంనాడు శ్రీ హెచ్. వి. కామత్ ఇది నిబంధనలకు విరుద్ధమని పాయింట్ ఆఫ్ ఆర్డర్ తెచ్చారు, దాని మూలంగా సభాపతి ప్రభుత్వాన్ని ఈవిధంగా కోరవలసి వచ్చింది.

### ఎడింబరో ఫిలిం ఉత్సవం

#### జపాన్ చిత్రానికి ప్రధమ స్థానం

లండన్, సెప్టెంబరు 5: 16 వ శతాబ్దపు వాతావరణంలో నిర్మించిన 'ఉగెట్సు మొనొగతరి' జపాన్ చిత్రానికి 1955 సంవత్సరం సెలిడ్ గోల్డెన్ లారెల్ వచ్చింది. ఎడింబరోలో జరిగిన ఫిలిం ఉత్సవంలో డగ్లస్ ఫేర్ బాంక్స్ జూనియర్ యీ ఫిలింను నిర్మించిన డైయీ ఫిలిం కంపెనీ మేనేజింగ్ డైరక్టర్ మత్సుతిరో కవగుచీ కి యీ బహుమానం ఇచ్చారు. ఈ బహుమానాన్ని జపాన్ చిత్రం గెలవటం ఇదే మొదటి సారి.

అమెరికన్ మధ్యవర్తులసంఘం ఒకటి తుది పరీక్షకు వచ్చిన ఈ కింది 4 చిత్రాలనుంచీ దీనిని ఎంచుకున్నారు.

(1) నరకద్వారం(జపాన్-డైరెక్టర్ తైనొసుకె కినుగసా) (2) కిడ్ నాపర్స్ (బ్రిటన్- ఫిలిప్ లెడ్ కాక్) (3) మా ప్రేయరు లోతాగారి సెలవలు (ఫ్రాన్స్-జాక్ తాతీ) (4) ఉగెట్సు మొనొగతరీ (జపాన్-కెంజీ మిజోగుచి).



Printed and Published for NageswaraRao Estates Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7 Thambu Chetty St., Madras - 1. Editor S. Sambhu Prasad